# విస్డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక

సంపాదకవర్గం

:సంపాదకుడు:

లయన్ కె.వి.గోవిందరావు బి.ఏ.,ఎల్.ఎల్.బి.,

గౌరవ సహాయ సంపాదకులు:

డా. ఎ.బి.సాయిప్రసాద్ ఎం.ఏ.,పిహెచ్.డి.

వి.బాలకుమార్ ఎం.ఏ.,బి.ఎడ్.,

సభ్యులు:

కె.వి.ఎస్.శరత్‌బాబు బి.ఏ.,బి.కాం.,బి.ఎల్.,

కె.వి.ఎస్.విజయకుమార్ బి.కాం.,

కె.రత్నకుమారి

## ఈ సంచికలో

అక్టోబరు 1994



:చందా వివరాలు:

3 సంవత్సరాల చందా రూ.140/-
సంవత్సర చందా రూ. 48/-
ఎయిర్ మెయిల్ (1 సం॥) రూ.200/-
సీ మెయిల్ (1 సం॥) రూ.100/-

:చందా పంపవలసిన చిరునామా:

రత్నా ఏజెన్సీస్
9, దేశికారోడ్, మైలాపూర్
మద్రాస్ - 600004
ఫోను : 4990327

-: ముఖచిత్రం: కలర్ ట్రాన్స్‌పరెన్సీ:-

శ్రీ మహంతేష్ సి. మొరాబాద్

## కారణాలు ఫలితాలు



మనిషి జీవితంలో సంభవించే సంఘటనలు కేవలం అతని ప్రతిబింబాలే. విధి మనిషిని ఎప్పుడూ వెంటాడుతూనే ఉంటుంది. విధి ముందు మనిషి బలహీనుడు. విధిని ప్రయత్నం ద్వారా కానీ, ప్రార్థనల ద్వారా కానీ అతను మార్చలేడు. గతంలో చేసిన తప్పులు దయ్యంలా మనిషిని పీడిస్తూ ఉంటాయి. మనిషి నుండి అవి నష్ట పరిహారాన్ని కోరుతూ వస్తాయి.

మనిషి జీవితం కారణాల ఫలితాల కలయిక. ఈ కలయిక కొత్తకు నాంది అయి ఫలాల్ని అందజేస్తుంది. మనిషి చేసే ప్రతి పనిలో కారణాలు, ఫలితాలు సమప్రభావం కలిగి ఉంటాయి. వ్యక్తి

(మిగతా 4 వ పేజీలో)

## బలహీనతకు గురికాకండి

మగ - వారు ఏ రంగానికి చెందినవారైనా సరే బలహీనతలకు గురి అవుతుంటారు. దీనికి కారణం చాలావరకు ఉద్రిక్తతే. మన చుట్టూ అతి వేగంగా ముందుకు దూసుకుపోతున్న జీవితం అడుగులో అడుగు వేసి వడివడిగా నడవ లేనప్పుడు తరచుగా మనం ఉద్రిక్తతకు లోనవుతుంటాము.

బలహీనతల నుండి ముక్తిని సాధించేందుకు కొన్ని సులువైన మార్గాలు ఉన్నాయి.

మొట్టమొదటి మార్గం ధైర్యాన్ని, ఆశను అలవర్చుకోవడం. జీవితంలో జరిగిన సంఘటనలను ఒకసారి మనసులో విశ్లేషించుకోండి. అప్పుడు మీలోని భయాలకు కారణాలు అర్థమవుతాయి. ఎప్పుడూ నిరుత్సాహ పడకండి. విశ్వాసం పట్టుదల సహాయంతో మీరు ఇతరులను వెనక్కు నెట్టి ముందుకు పోగలుగుతారు.

రెండు: జీవితం పట్ల మీకున్న ధోరణిని మార్చుకోండి. ఎప్పుడూ దిగాలు పడకండి. ఇతరులు మిమ్మల్ని కలవరబెడితే ఆ విషయాన్ని మరచిపొండి. మీ ఆలోచనలతో సరిపోని అభిప్రాయాన్ని చిరునవ్వులతో స్వీకరించండి. ఆటగాడి మనస్తత్వాన్ని అలవరచుకోండి.

-థామస్ హ్యాగ్స్

మూడు: నిర్మలమైన ఆలోచనలను అలవాటు చేసుకోండి. ప్రతికూల పరిస్థితుల నుండి కూడా మంచిని గ్రహించగలమని నమ్మండి.



నాలుగు: మీకు నిజంగా నచ్చే పనిని చేయండి. ఎదురు దెబ్బలను అనుకూలంగా మార్చుకోగలనన్న నమ్మకాన్ని బాగా పెంచుకోండి. మీ శక్తి, సామర్థ్యాలను తెలుసుకుని వాటిని ఉపయోగించుకోండి. మీలోని బలహీనతలను పారద్రోలేందుకు బాగా శ్రమించండి.

ఐదు: సక్రమ ఆలోచనలతో మీ మెదడును నింపేందుకు ప్రయత్నించండి. నిజవైఖరి విజయాన్ని సాధించి పెట్టగలదు. మనసు కన్న కలలను వ్యక్తి తప్పక సాధించగలడు.

ఆరు: ఆత్మవిశ్వాసాన్ని సాధించి కార్యరంగంలో దిగండి. మీ జీవితం శూన్యంలో నిండినదనో లేక వ్యర్థమైందనో ఎప్పుడూ భావించకండి. త్రాగుడు, సిగరెట్టు లేదా నిద్రమాత్రలు మీకు ఉపశమనాన్ని కలిగిస్తాయనో లేదా బలహీనత నుండి ముక్తిని ప్రసాదించగలవన్న నిర్ణయానికి ఎప్పుడూ రాకండి. మీ శక్తి సామర్థ్యాలపై విశ్వాసాన్ని పెంచుకోండి.

ఏడు: మీ బాధలను - కష్టాలను మీలో దాచుకోకండి. మిమ్మల్ని బాధ పెడుతున్న విషయాల్ని శ్రద్ధగా వినే మీ ఆంతరంగిక మిత్రుడితోనో లేదా ముందు వెనుకా తెలియని పరాయి వ్యక్తితోనూ చర్చించండి.

ఎనిమిది: విశ్రాంతి తీసుకోవడం అన్నది ఒక కళ. ఈ కళను నేర్చుకుని పాటించండి. ఉద్రిక్తత నుండి విముక్తి పొందేందుకు విశ్రాంతి సహాయకారి అవుతుంది. పుస్తక పఠనం, నడక, మరిచేందుకు ఉపయోగపడే అభిరుచి, ఒక మంచి మిత్రుడితో కాలక్షేపం, బాధకు గురైన వ్యక్తిని ఉత్సాహపరుస్తూ రాసే కార్డు ముక్క ఇత్యాదులు బలహీనతలను మన నుండి దూరం చేయగలవు. బాధలోని చేదును, సుఖంలోని తీపిని ఒకే విధంగా స్వీకరించగలిగే బుద్ధిని అలవరచుకోండి. లేని పక్షంలో మీరు సులభంగా రెచ్చిపోగలరు. నిశ్శబ్దంగా ఉన్న గదిలో కూర్చొని మీ బలహీనతలకు గల కారణాలను అన్వేషించండి.

## కేరళలో చదువుకున్న నిరుద్యోగులు

కేరళలో ప్రతి పదిమందికి ఒకరు చొప్పున చదువుకున్న నిరుద్యోగులున్నారు.

"వివేకవంతుడెప్పుడూ నిన్నటికంటే, రేపటికంటే, నేడు తెలివిగా మసలుకుంటాడు."

—పోప్

ప్రొఫెసర్ సి.పి. రామన్ మీనన్



చదరంగం ఆటకు కర్ణుడు పెట్టింది పేరు. కర్ణుడి మిత్రుడు దుర్యోధనుడు, మిత్రుడి భార్య భానుమతి ఇద్దరూ ఒకరికొకరు తీసిపోని ప్రవీణులే. ప్రతి రాత్రి ముగ్గురూ కలిసి రెండు ఆటలు ఆడేవారు. ఆటలు సాధారణంగా దుర్యోధనుడి పడకగది పక్కనున్న గదిలో జరిగేవి. వారి పరస్పర ఒప్పందం ప్రకారం మొదటి ఆట ఇద్దరి మధ్యలో జరిగేది. మొదటి ఆటలో గెలిచిన వ్యక్తి మూడవ వ్యక్తితో ఆట ఆడాలి. మరునటి రోజుకు ఆట ఎప్పుడూ వాయిదా పడేది కాదు.

ఒక రోజు రాత్రి.... ఆట దుర్యోధనుడు - కర్ణుడు ఇద్దరి మధ్యలో జోరుగా సాగింది. ఆట చాలా ప్రొద్దు పోయేంతవరకు జరిగింది. చివర్లో కర్ణుడు ఆట గెలిచాడు. ఆనవాయితీ ప్రకారం రెండవ ఆట కర్ణుడు భానుమతితో ఆడటం మొదలు పెట్టాడు. ఈసారి కూడా ఎత్తులు పైఎత్తుల కారణంగా ఆట చాలాసేపు జరుగుతూ వచ్చింది. ఆట మధ్యలో దుర్యోధనుడు లేచి తన గదికి వెళ్ళి నిద్రపోయాడు.

రాత్రి మధ్యలో దుర్యోధనుడు మేల్కొన్నాడు. పక్కలో భానుమతి లేకపోవడం అతన్ని

( 2 వ పేజీ తరువాయి)

కారణాన్ని ఎన్నుకుంటాడు (దీన్నే స్వేచ్ఛా మనసు అంటారు). కాని ఫలితాన్ని ఎన్నుకోవటం కాని, మార్చటం కాని, తప్పించుకోవటం కాని చేయలేడు (దీన్నే 'విధి' అంటారు). ఈ విధంగా స్వేచ్ఛా మనసు పనుల ప్రారంభానికి కావల్సిన శక్తిని ప్రసాదిస్తుంది. విధి అంటే అర్థం ఫలితాలలో చిక్కుకుపోవటమే.

"ఎవరిపట్లా ద్వేషం లేకుండా, అందరిపట్లా ఉదారంగా ఉంటాను."

— అబ్రహాం లింకన్

ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. బహుశా ఆట ముగిసి వుండదనుకొన్నాడు దుర్యోధనుడు. సమ ఉజ్జీల మధ్య జోరుగా జరుగుతున్న ఆటను చూడాలన్న ఉత్సుకతతో దుర్యోధనుడు ఆట జరుగుతున్న గదిలో ప్రవేశించాడు.

ఇద్దరూ ఆటలో గట్టివారు కావటం వల్ల ఆట మంచి రసపట్టులో ప్రవేశించింది. ఎత్తులు పైఎత్తులు వేస్తూ ఇద్దరిలో ఏ ఒక్కరూ మరొకరికి ఏమాత్రం అవకాశం ఇవ్వకుండా ఆటలో నిమగ్నులై ఆడసాగారు. ఎత్తులు వేయడానికి భానుమతి ఎక్కువ కాలం తీసుకోవడంతో కర్ణుడు కాస్తంత చికాకు పడ్డాడు. అసహనంగా అటూ ఇటూ కదలసాగాడు. తెల్లవారే వరకు ఆట కొనసాగితే కాలకృత్యాలు ఎలా తీర్చు కోవడం, సూర్యభగవానుణ్ణి ఎలా ప్రార్థించడం అని తేల్చుకోలేని కర్ణుడు లోలోపల మదనపడసాగాడు. లాభం లేదని భానుమతి చెయి పట్టుకుని ఒక పావును జరుపమన్నాడు. సరిగ్గా ఆ సమయానికి దుర్యోధనుడు ఆ గదిలో ప్రవేశించాడు.

కర్ణుడు ప్రవేశిస్తున్న రారాజును చూచాడు. గౌరవ సూచకంగా లేచి నిలబడుతూ "రారాజా! రారాణి చేయి పట్టుకున్నవానికి శిరచ్ఛేదన దండన ఇవ్వబడుతుంది. ఆ దండన నాకు మీరు వెంటనే ఇప్పించండి" అని అన్నాడు. చిరునవ్వుతో జవాబు చెబుతూ "మిత్రమా! ఇలా నాతో మాట్లాడడానికి నీకు చాదస్తమా? నాకు ఆ మాత్రం లోకజ్ఞానం లేదనుకున్నావా? ఆట ఆడుతున్నప్పుడు నీవు ఆటలో పూర్తిగా మునిగిపోతావన్న సంగతి నాకు తెలుసు. ఆటలో నిమగ్నుడవయి నప్పుడు నీ ప్రత్యర్థి ఎవరన్నది కూడా నీవు మరచిపోతావు. నీవు ముట్టిన వ్యక్తి రారాణి కాదు, నీ ప్రత్యర్థి మాత్రమే. ప్రత్యర్థి పావును జరుపడంలో జాప్యం చేస్తున్నది. ఇద్దరూ ఆటను కొనసాగించండి" అన్నాడు.

మిత్రుడి మాటలను విన్న కర్ణుడి కళ్ళు నుండి కన్నీళ్ళు జలజలమని రాలసాగాయి. కర్ణుడి ఒళ్ళు పులకరించింది. తబ్బిబ్బవుతూ "మిత్రమా! నీ మాటలు నా నమ్మకానికి మరోసారి బలాన్నిచ్చాయి. నన్ను పూర్తిగా నీవు మాత్రమే అర్థం చేసుకోగలిగావు. నీవు తప్ప ఈ భూప్రపంచంలో ఎవరూ నన్ను అర్థం చేసుకోలేదు. ఇప్పటివరకు నీవు నా రారాజువు. నేను నిశ్చింతగా జీవించడానికి కారణం నీవే. కానీ ఈ క్షణం నుండి నీవు నాకు ప్రాణదానం చేసిన అతి గొప్ప స్నేహితుడవు. ఆఖరి శ్వాస దాకా నీకు సేవ చేసేందుకు అవకాశమివ్వమని ఆ భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను" అన్నాడు. కర్ణుడు తన ప్రాణాన్ని తిరిగి పొంది నందుకు ఆనందభాష్పాలను రాల్చలేదు. తనను సరిగ్గా అర్థం చేసుకున్న ఒక గొప్ప మిత్రుడు దొరికాడన్న సంతోషం కారణంగానే కర్ణుడు ఆనంద కన్నీరు కార్చాడు.

## రెండు వంపుల ధనురాకార మున్న ఏకైక డామ్

కేరళ రాష్ట్రంలో నున్న ఇడుక్కిడామ్ మన దేశంలోని ఏకైక రెండు వంపుల ధనురాకార మున్న డామ్.

"బుద్ధికంటే హృదయం గొప్పదని మానవాళికి నేర్పింది క్రైస్తవం."
—మారిటైన్

ఏ.ఆర్. షరీఫ్

ప్రాచీన తమిళుల ఇంజనీరింగు నేర్పరితనానికి మధుర మీనాక్షి సుందరేశ్వర దేవాలయంలోని ప్రసిద్ధి గాంచిన వెయ్యి స్తంభాల మండపం అతి చక్కటి తార్కాణం. వెయ్యి స్తంభాల మండపాన్ని తమిళంలో "ఆయిరమ్ కాల్ మండపం" అంటారు. ఈ మండపం అతి విశాలమైన ఆ దేవాలయానికి ఈశాన్య దిశలో ఉంది.



క్రీస్తు శకం 1560లో ఈ ఆలయ నిర్మాణం జరిగింది. పేరు సూచించే విధంగా ఈ మండపం కప్పు వెయ్యి స్తంభాల ఆధారంగా వేయబడలేదు. ఈ మండపంలో 985 స్తంభాలు మాత్రం ఉన్నాయి. వెయ్యికి 15 స్తంభాలు మాత్రమే తక్కువ. మనల్ని ఆశ్చర్య చకితుల్ని చేసే ఈ స్తంభాల వరుస ఏ కోణం నుండి చూచినా చిత్ర విచిత్రంగా కనబడుతుంది. ఈ స్తంభాల అరణ్యంలో నడుస్తుంటే మనను ఒక విచిత్ర అనుభూతికి గురి అవుతుంది. స్తంభాల నిర్మాణం వెనుక దాగున్న శిల్ప కళానైపుణ్యం మనల్ని దిగ్భ్రాంతుల్ని చేస్తుంది.

కళ, పనితనం, ఇంజినీరింగ్ నైపుణ్యాల కలయిక ఈ భవ్య మండపం. విచిత్ర కల్పన, సాహసవంతమైన పనితనంతో కూడిన ఈ మండపంలో పౌరాణిక పాత్రల సన్నివేశాలు చెక్కబడ్డాయి. శివుడి అనేక ఆకృతులు, యుద్ధ వీరుల, సంగీతజ్ఞుల, కురవల (ఒక రకమైన సంచార జాతివారు), మొదలైనవారి బొమ్మలు కూడా చక్కగా చెక్కబడ్డాయి. కురవడు అతని భార్య బొమ్మలు ఈ సంచారజాతి పేదరితనాన్ని, ఆ జాతి గరకుతనాన్ని, వారి ఇతర పచ్చి వాస్తవాల్ని ఋజువు పరుస్తాయి. ఈ మండపంలో పిలుపు అందుకుని ముందుకు దూసుకు వచ్చే సింహాలను స్తంభాలపై శిల్పులు మరీమరీ చెక్కారు.

గాకుండా ఉండాలంటే, గుణవంతులతో కలిసి
—జార్జి వాషింగ్టన్

## పడమటి ఆసియా ఖండపు గొప్ప భాస్వర నిక్షేపాలు

పశ్చిమ ఆసియా ఖండం, సౌదీ అరేబియా లోని జాలాయిడ్ ప్రాంతంలో గొప్ప భాస్వర నిక్షేపాలను ఇటీవల కనుగొన్నారు. ఈ నిక్షేపాలకు సాటి అయినవి ప్రపంచంలో మరెక్కడా లేవు. 310 మిలియన్ల టన్నుల ఖనిజం ఇక్కడ నిలువ ఉన్నట్లు భావించ బడుతూంది.

## గంటకు 500 కి.మీ.లు ప్రయాణం చేసే అయస్కాంత రైళ్ళు



జర్మనీలో తక్కువ ఉష్ణోగ్రత ప్రసారం ద్వారా నడిచే రైలును తయారు చేశారు. ఈ అయస్కాంత రైలు ప్రత్యేకంగా తయారు చేయబడ్డ పట్టాలపై నడుస్తుంది. రైలులో అమర్చబడిన అయస్కాంతం ఎలక్ట్రో-మాగ్నటిక్ క్షేత్రాన్ని సృష్టిస్తుంది. ఆ కారణంగా పట్టాలపై రైలు ముందుకు సాగిపోతుంది. 1700 టన్నుల బరువున్న ఈ రైలు గంటకు 500 కి.మీ.ల వేగంతో పరుగిడ గలదు.

## ప్రపంచంలో భారీ ఎత్తున బ్రెడ్ తయారీ

ప్రభుత్వ రంగానికి చెందిన మాడర్న్ ఫుడ్ ఇండస్ట్రీస్ (MFIL) వారు సుమారు 50 కోట్లకు మించిన వ్యాపారం చేస్తున్నారు. ఆ కారణంగా వీరు ప్రపంచంలోని భారీ ఎత్తున బ్రెడ్ తయారీ చేయు నిపుణులుగా భావించ బడుతున్నారు.

## అద్వితీయమైన ప్రపంచ పటము

ఒక అద్వితీయమైన ప్రపంచ పటాన్ని

*1955 లో స్థాపించబడిన స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా - ఇండియాలో పెద్ద బ్యాంక్. దేశంలో 8,691 శాఖలు, ప్రపంచం మొత్తంలో 49 కార్యాలయాలు, మరియు 767 ఎక్స్‌టెన్షన్ కౌంటర్స్ కలిగి ఉన్నది. ప్రస్తుతం బ్యాంకు నిల్వలు 66,317 కోట్ల రూపాయలు కాగా అడ్వాన్సులు 47,695 కోట్ల రూపాయలు. 1992 - 93 లో స్టేట్ బ్యాంక్ 212 కోట్ల రూపాయల నికరలాభం ఆర్జించి, ఇండియాలో అత్యధిక లాభార్జన చేసిన బ్యాంక్‌గా రూపొందింది.*

"అంతరాత్మ అనేది మానవునిలోని దైవత్వం." —[illegible]

రష్యాలో పూర్తి చేశారు. ఇందులో ప్రప్రథమంగా భూగోళంలోని సముద్రాలను కూడా జతపరిచారు. సముద్ర తీరాల ఉపశమనం ఈ మ్యాపు ప్రత్యేకత. ఈ మ్యాపు తయారీకు సాల్యూట్ 5 అంతరిక్ష స్థావరం సిబ్బంది తీసిన ఛాయాచిత్రాలు ఉపయోగపడ్డాయి.

## డిజిటల్ చేతి గడియారం జతలో కాలుక్‌లేటర్

అంకెల ద్వారా సమయాన్ని సూచించే గడియారాన్ని డిజిటల్ వాచ్ అంటారు. జపాను దేశంలో తయారైన డిజిటల్ చేతి గడియారం - గంటలు, నిమిషాలు, సెకన్లతో పాటు, తేది, వారం కూడా సూచిస్తుంది. కాలుక్‌లేటరుగా వాడబడుతున్నప్పుడు గడియారం ముందుకు సాగుతూ, వర్గ మూలాల్ని, శాతాల్ని, కూడికల్ని చేయ గలదు. ఈ కాలుక్‌లేటర్‌కు జ్ఞాపకశక్తి సదు పాయం కూడా ఉంది.

## గోధుమ వాడని కొత్తరకం బ్రెడ్

గోధుమను ఏమాత్రం వాడని కొత్త రకం బ్రెడ్‌ను 'ది యునైటెడ్ నేషన్స్ ఫుడ్ అండ్ అగ్రికల్చురల్ సంస్థ' (FAO) వారు తయారు చేశారు. ఇప్పుడు జొన్నలు, బియ్యం, మొక్కజొన్న లేక ఒక రకం దుంప పిండితో బ్రెడ్ తయారు కాగలదు. అభివృద్ధి చెందుతున్న పేద దేశాల నుండి కరవు కాటకాలను పారద్రోలేందుకు ఈ రకం తయారీ పద్ధతి ఎంతైనా దోహదకారి కాగలదు.

## అధ్యక్ష పదవీ నిర్వహణలో రికార్డును సృష్టించిన వ్యక్తి

ఇండోనేషియా అధ్యక్షుడు జనరల్ సుహార్తో ఎక్కువ కాలం పదవిలో కొనసాగు



"నేను ఏథెన్స్ నగరవాసినీ కాదు, గ్రీకు దేశస్థుణ్ణీ కాదు - ప్రపంచ పౌరుణ్ణి."

— సోక్రటీస్

తూన్న అధ్యక్షుడిగా ప్రపంచ రికార్డును సృష్టించారు.

## రక్తపు పోటును సూచించే ఎలక్ట్రానిక్ మీటరు

జపానులోని ఓమ్రాన్ కార్పొరేషన్ వారు రక్తపు పోటును సూచించే ఎలక్ట్రానిక్ మీటరును ఇటీవల తయారు చేసారు. చేతి వ్రేలును మీటరులో పెట్టినంత మాత్రాన అప్పటికప్పుడే రక్తపోటును ఇది సూచించగలదు.

—'పసిఫిక్ ఫ్రెండ్' సౌజన్యంతో

## ఇంతకు ముందెన్నడూ తయారు కానంత పెద్ద కేకు

బెంగళూరు మహానగరంలో ఇటీవల ఒక వార్షిక ఛారిటీ విక్రయ ప్రదర్శన ఏర్పాటు చేయబడింది. మనసును ఆనంద పరచే అతి విశాలమైన 700 కేజీల బరువున్న ఒక పెద్ద కేకు ప్రదర్శించబడింది. ఇంతకు ముందెన్నడూ మనదేశంలో ఇంత పెద్ద కేకు తయారు కాబడలేదు. ఈ కేకు తయారీకి 120 కేజీల పిండిని, 270 కేజీల చక్కెరను, 3,400 గ్రుడ్లను, 920 గ్రాముల ఉప్పును, 1,150 గ్రాముల బేకింగ్ పౌడర్‌ను వాడారట.

## ప్రపంచంలోని అతిపెద్ద సహజ వాయువు క్షేత్రం

ఖతార్ (Qatar) దేశపు నార్త్ ఫీల్డు ప్రపంచంలోని అతి విశాలమైన సహజ వాయు క్షేత్రం. ఇక్కడ 250 ట్రిలియన్ల స్టాండర్డ్ క్యూబిక్ ఫీట్ (ఒక ఘన అడుగు) సహజవాయువు ఉన్నట్లు నిరూపించబడింది. సుమారు 5,000 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణం ఉన్న ఈ ప్రాంతాన్ని 1971లో కనుగొన్నారు.

## అతి ఎత్తైన తాటి మార్గం

ఉత్తరప్రదేశ్‌లోని జోషిమఠ్ - జౌలిల మధ్య ఉన్న తాటి మార్గం ప్రపంచంలోని అతి ఎత్తైన తాటి మార్గం. ఇంతటి పొడవైన తాటిమార్గం ఆసియా ఖండంలో మరెక్కడా లేదు. 12 కోట్ల రూపాయలు ఖర్చు చేసి ఈ మార్గాన్ని నిర్మించారు. 4 కిలోమీటర్లు పొడవున్న ఈ మార్గాన్ని దాటేందుకు 15 నిమిషాల కాలం పడుతుంది. 6,000 అడుగుల ఎత్తు నుండి 10,000 అడుగుల ఎత్తు వరకు ఈ మార్గం పోతుంది.

## ఆచార్య డేనియల్‌గారికి 'అంతర్జాతీయ సహకార మెడల్'

ఇంటర్నేషనల్ కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ యూనియన్స్ కమిటి ఆన్ స్పేస్ రిసెర్చి సంస్థ వారు మద్రాసుకు చెందిన ఆచార్య ఆర్.ఆర్. డేనియల్‌గారికి *"1994 అంతర్జాతీయ సహకార మెడల్" బహూకరించి సత్కరించారు. అంతరిక్ష పరిశోధనా క్షేత్రంలో అంతర్జాతీయ శాస్త్రీయ సహకారం కోసం వారు అందజేసిన మద్దతుకుగాను ఆ సంస్థ వారు ఆచార్య డేనియల్‌గారిని ఎన్నుకుని గౌరవించారు.*

"నీవు చేస్తున్న పని ధర్మ విరుద్ధము కాదని నీకు పూర్తిగా విశ్వాసము కలిగినప్పుడు ఆకర్మ సత్కర్మయే అవుతుంది."

## 1959 లో దలైలామా టిబెట్‌ను వదిలారు


Dalai Lama

టిబెట్ వాసుల ఆధ్యాత్మిక నాయకుడు దలైలామా చైనీయుల దురాక్రమణ కారణంగా 1959 మార్చి 31 వ తారీఖున, టిబెట్ వదలి పారిపోయారు. వారు అప్పుడు భారతదేశంలో ఆశ్రయం కోరారు.

## నెల్సన్ మండేలాకు యావజ్జీవిత కారాగారపు దండన

దక్షిణ ఆఫ్రికాకు చెందిన నెల్సన్ మండేలాకు యావజ్జీవిత. కారాగారపు దండన 14 జూన్ 1964 న ఇవ్వబడింది. మీరు వృత్తిచే న్యాయవాది. ఈ నల్ల జాతి ఆఫ్రికన్ల ప్రియతమ నాయకుణ్ణి బందీ చేసి కేప్‌టౌన్‌కు 7 మైళ్ళ దూరాన ఉన్న రాబ్బెన్ (Robben) దీవులకు పంపారు. ఈ దండనకు యావత్ ప్రపంచం తన నిరసనను తెలియజేసింది.

## ఎడిసన్ తెరమీద ప్రదర్శించిన టాకీ సినిమా!

ఆగస్టు 27, 1910 న థామస్ ఆల్వా ఎడిసన్ తెరమీద టాకీను ప్రదర్శించారు. ఈ ప్రదర్శనను వారు న్యూజెర్సీ (అమెరికా) కు చెందిన దక్షిణ ఆరెంజ్‌లోని తమ ప్రయోగశాలలో ఏర్పాటు చేశారు. ప్రదర్శనను వారు ధ్వనిని గ్రహించి ఉచ్చరించే (Phonograph) యంత్రం సహాయంతో చేయగలిగారు.

## భారత్ ఇంగ్లాండ్ జట్ల మధ్య జరిగిన తొలి క్రికెట్ టెస్ట్ మ్యాచ్

ఇంగ్లాండుకు భారతదేశపు క్రికెట్ జట్టుకు మధ్య మొట్టమొదటి టెస్ట్ మ్యాచ్ ఇంగ్లాండ్‌లోని లార్డ్స్‌లో 25 జూన్ 1932లో జరిగింది. భారతదేశం జట్టు 158 పరుగుల తేడాతో ఆ మ్యాచ్ ఓడిపోయింది.

## అత్యధికంగా తేయాకు వేలం జరిగే రెండవ కేంద్రం

*కొలంబో (శ్రీలంక) తరువాత గౌహతీ (అస్సాం) - ప్రపంచంలో అత్యధికంగా తేయాకు వేలం వేసే రెండవ కేంద్రంగా ఉన్నది.*

"మనదేశంలోని మహాత్ములందరు ధర్మోపన్యాసాల ద్వారా గాక ధర్మాచరణ ద్వారానే ఆకర్షింపబడ్డారు."

## స్వదేశీ విమానయానాలు 1932 లో ప్రారంభింపబడ్డాయి



1932 వ సంవత్సరం అక్టోబరు 15వ తారీఖున మనదేశంలో స్వదేశీ విమానయానాలు ప్రారంభింపబడ్డాయి. ఈ విమాన యానం కరాచి (ప్రస్తుతం పాకిస్థాన్‌లో ఒక నగరం)లో ప్రారంభమైంది. అహమ్మదాబాద్, బొంబాయి, బళ్ళారీల మీదుగా ఎగురుతూ ఈ విమానం మద్రాసు చేరింది. భారత రత్న శ్రీ జె.ఆర్.డి.టాటా ఈ ప్రయాణపు మొదటి దశ వరకు (కరాచి, అహమ్మదాబాద్ - బొంబాయి) చోదకుడు (pilot).

## అతి చిన్న వయసులో ప్రపంచపు హెవీ వెయిట్ బాక్సింగ్ ఛాంపియన్ షిప్‌ను పొందిన ఏకైక వ్యక్తి

20 సంవత్సరాల వయసులోనే మైక్ టైసన్ ప్రపంచ రికార్డును సృష్టించాడు. 1986 నవంబర్ నెల 22 వ తారీఖున లాస్ వెగాస్ (Las Vegas) లో రెండే రెండు రౌండ్లలో యు.ఎస్.ఏ.కు చెందిన ట్రివర్ బెర్‌బిక్ (Trevor Berbick) ను చిత్తుచేసి టైసన్ ప్రపంచపు హెవీ వెయిట్ బాక్సింగ్ పట్టాను పొందాడు.

## అంతర్జాతీయ అణుశక్తి ఏజెన్సీ

అంతర్జాతీయ అణుశక్తి ఏజెన్సీను 1956, అక్టోబరు 26 తారీఖున ఏర్పరిచారు.

## వాయు మార్గం గుండా తొలిసారి తపాలా సర్వీసు

వాయుమార్గం గుండా తొలిసారి తపాలాను చేరవేయడం 1918 లో ప్రారంభమైంది. అమెరికాలోని న్యూయార్క్, ఫిలడల్ఫియా, వాషింగ్టన్ డి.సి. నగరాల మధ్య ప్రపంచంలో తొలిసారి వాయుమార్గం ద్వారా తపాలా చేరవేయబడ్డది. ఆ రోజుల్లో విమాన ప్రయాణం ఎంతో సాహసంతో కూడుకున్న పని. ఎగిరేందుకు కావల్సిన ఆధునిక పరికరాలు, యంత్రాలు, సాధనాలు ఆ రోజులలో అసలు ఉండేవి కావు.

## జనాభా ఎదుగుదల ఒక శాతం మాత్రమే

*జపాను దేశం తన జనాభా ఎదుగుదలను ఒక శాతంకు పరిమితం చేసుకుంది. ప్రస్తుతం ఆ దేశం జనాభా 1,24,500,000.*

"[illegible] క్రమక్రమంగా [illegible] [illegible] చేస్తాయి."

డా. ప్రభు సోన్‌పార్

మన నాగరికత - భోగ భాగ్యాల కారణంగా మనకు సంక్రమించిన వ్యాధి ఈ నడుము నొప్పి. పడుకునే తీరును బట్టి ఈ వ్యాధికి మనం గురి అవుతున్నాం.



ఇది ప్రధానంగా కండరాల నొప్పే. మనం ఆఫీసులలో వాడే సాధారణ కుర్చీ ఈ వ్యాధికి కారణం. ఉన్నత అధికారులు వాడే ఛెయిర్ సున్నితంగాను, సుఖకరంగాను ఉండవచ్చును. కాని ఇవేవి మన వెన్నెముకను నిటారుగా ఉంచలేవు. టైపిస్టు లేక కంప్యూటర్ ఆపరేటరు పని చేస్తున్నప్పుడు సాధారణంగా తమ ఛెయిర్లపై వాలి పోతుంటారు. కంప్యూటర్ తెరను చూడడానికి తమ మెడను విచిత్రంగా తిప్పుతుంటారు. మన పరుపులు కూడా వీపునొప్పికి కారణాలే. దళసరిగా ఉంటూ మెత్తదనాన్ని కలిగిన పరుపులు మన వెన్నెముక నిర్మాణానికి, దాని వొంపులకు అనుకూలంగా ఉండవు.

వెన్నెముకలోని డిస్క్‌స్థానం తారు మారైనప్పుడు కూడా ఈ నొప్పులు వచ్చే అవకాశాలున్నాయి. ఈ డిస్క్ రెండు కీళ్ళకు మధ్య కుషన్‌లా పని చేస్తూ ఒత్తిడిని హరిస్తుంటుంది. కొన్ని కారణాల వల్ల డిస్క్ తన స్థానం నుండి కొంత పక్కకు తొలుగుతుంది. తొలగిన డిస్క్ నరాలపైన లేదా వెన్నుపూసపైన ఒత్తిడిని తెస్తుంది. ఈ ఒత్తిడివల్ల బాధ జనిస్తుంది. నడుము నొప్పికి మరికొన్ని కారణాలు కూడా ఉన్నాయి. అందులో మొదటిది సక్రమమైన పద్ధతిలో కాకుండా మొరటుగా బరువులను ఎత్తడం. వీపు, పొత్తికడుపుకు, కండరాలకు తగిన వ్యాయామం లేనిపక్షంలో కూడా నొప్పి రావడానికి అవకాశం ఉంది. బాన కడుపు ఉన్నవారికి ఇది వచ్చే అవకాశాలు చాలా

## ఆస్ట్రేలియాలో హిమనదులు లేవు

*ఖండాలలో - అతివేడిగల - ఆఫ్రికాలో 13 చ.కి.మీటల మేరకు హిమనదులు (పర్వతం పైన పెద్ద మంచుగడ్డలు కరిగి నెమ్మదిగా క్రిందికి పారుతుంటాయి) ఉండగా ఆస్ట్రేలియాలో హిమనదులే లేవు.*

[illegible]
[illegible]

—స్వామి చిన్మయానంద

ఉన్నాయి. ఇవి కాక ఇతర సామాన్య కారణాలలో మనం స్పాండిలైటిస్ (కీళ్ళ వాపు రోగం)ను చేర్చవచ్చును.

మనం పడుకునే తీరును మార్చుకుని, క్రమం తప్పకుండా వ్యాయామం చేయగలిగితే ఈ బాధను నివారింపవచ్చును. ఈ రెండింటికి మించిన ఇతర మార్గాలు లేవు. మీరు ఇప్పటికే ఈ నొప్పితో బాధపడుతుంటే వెంటనే మీ డాక్టరును సంప్రదించండి. అతను పరీక్షించి మీకు ఈ వ్యాధి ఉన్నది, లేనిది మీ వెన్నెముక డిస్క్ జారింది, లేనిది లేక ఇతర హానికర వ్యాధులకు గురి అయ్యే అవకాశాలు ఉన్నది, లేనిది చెప్పగలడు.

నొప్పిని దూరం చేసే 'మాత్రలు, కండరాలకు విశ్రాంతి నిచ్చే ఔషధాల సేవన, షార్ట్ వేవ్ డయాథర్మీ (వేడిమిని తన గుండా పోయేందుకు సహాయపడే యంత్రం) విశ్రాంతి ఇత్యాదుల సహాయంతో ఈ బాధ నుండి విముక్తిని పొందవచ్చును. ఇవన్నీ తాత్కాలిక ఉపశమనాలే. అప్పటికప్పుడు ఇవి నొప్పిని తగ్గించ గలవు. నొప్పి మటు మాయమైనట్లే అయి తిరిగి రాగలదు. రోగ నివారణోపాయాలను కనుగొన్నప్పుడే ఈ నొప్పి దూరమవుతుంది.

యోగాభ్యాసం ఈ నొప్పి నివారణకు సరైన మార్గం. యోగాభ్యాసం సున్నితమైన, లయబద్ధమైన వ్యాయామాన్ని సూచించడమే కాకుండా విశ్రాంతికి సంబంధించిన సాంకేతిక మార్గాలను కూడా బోధిస్తుంది. పర్వతాసనం, గోముఖాసనం, యష్టికాసనం, హస్త పాదాంగుష్ఠాసనం, భుజంగాసనం, ధనుర్వక్రాసనం లాంటి ఆసనాలను అభ్యసించి ఈ నొప్పినుండి విముక్తిని పొందవచ్చు. ప్రాణాయామం, విశ్రాంతినిచ్చే శవాసనం, నిస్పందభవ ఆసనం, మకరాసనం ఇత్యాదుల వల్ల నడుము, కండరాలకు మెత్తదనం అబ్బుతుంది.

— 'యోగా & టోటల్ హెల్త్' సౌజన్యంతో

## 5 లక్షల టన్నుల న్యూస్ ప్రింట్ వాడే వార్తా పత్రికలు



*భారత వార్తాపత్రికల పరిశ్రమ - 2,000 టన్నుల సిరా, 5 లక్షల టన్నుల న్యూస్‌ప్రింట్, 2 లక్షల చదరపు మీటర్ల ప్రింటింగ్ ప్లేట్ మరియు 3 లక్షల చదరపు మీటర్ల ఫోటోటైప్ సెట్టింగ్ పేపర్ ఉపయోగిస్తుంది.*

"మీకు కష్టాలు వచ్చినప్పుడు హిమాలయంలా స్థిరంగా నిలబడండి.
ఇతరుల బాధలకు గంగలా కరిగి ప్రవహించండి."

## వయసుకు వందనం

ఇండియా వంటి సంప్రదాయబద్ధమైన వారసత్వం గల దేశంలో ఒక వ్యక్తిని గౌరవించేందుకు వయస్సు మాత్రమే హక్కు కలిగివుంటుంది.

## ఉత్తమవ్యక్తి, సుఖమయ వ్యక్తి

తనను సక్రమంగా రూపొందించుకునేందుకు అత్యంత ప్రయత్నం చేసేవాడు ఉత్తమవ్యక్తి. లోపం లేకుండా ఉన్నానని తనను తానే భావించేవాడు సుఖమయ వ్యక్తి.

— సోక్రటీస్

## నిరాశావాది నుంచే ఋణం

నీవు ఋణం చేయదలిస్తే ఎప్పుడూ ఒక నిరాశా జీవి నుంచే అప్పు తీసుకో, ఎందుకంటే అది తిరిగి వస్తుందని అతడు ఎప్పుడూ భావించడు.

## డబ్బిచ్చి కొనే ఉద్దేశం లేని వ్యక్తులు కూడా....

ఒక దుకాణాదారుడు మరో దుకాణదారుడితో "ఏం చెప్పమంటారు. డబ్బిచ్చి వస్తువులను కొనాలనే ఉద్దేశం లేనివారు కూడా వస్తువులను కొనడం లేదు."

## మెదడులోని ముల్లు

కాలులోని ముల్లు మనల్ని ముందుకు సాగనివ్వదు. కామం, కోరికలు మెదడులోని ముళ్ళు. ఈ ముళ్ళు మనల్ని జ్ఞానపథంపై సులువుగా నడవనివ్వవు.

## విజయం ఒక నిచ్చెన

'విజయం ఒక నిచ్చెన' అని మహానుభావుల జీవిత చరిత్రలు నిరూపిస్తాయి. జేబుల్లో చెయ్యి దూర్చి ఎవరూ నిచ్చెన ఎక్కలేరు. మనస్సాక్షికి లోబడి నిరంతరం శ్రమించగలిగిన వ్యక్తే తనలోని ప్రతిభను పెంచుకోగలడు. అప్పుడే అతనిలో ఉన్న కళలకు మంచి రాణింపు రాగలదు.

## మెదడు, నాటిన విత్తుల ఫలాన్ని ఇవ్వగలదు

మానవమేధ అతి గొప్పది. దీని

లోతుపాతులను గూర్చి పూర్తిగా పరిశోధన ఇంకా జరగలేదు. మెదడు పంటభూమి లాంటిది. మీరు మంచిని నాటితే మంచిని, చెడును నాటితే చెడు ఫలాన్ని మనకు అందిస్తుంది. నాటిన విత్తుకు ఇది ప్రతిఫలాన్నిస్తుంది.

## రాజకీయ నాయకుడు - రాజనీతి దురంధరుడు

అవతలివాడి రాజకీయాలతో మీరు అంగీకరించరనుకోండి. అప్పుడు అతడు రాజకీయ నాయకుడు. మీరు ఆయనతో అంగీకరించారనుకోండి. అప్పుడు ఆయన రాజకీయ దురంధరుడు (Statesman)

— ల్లాయిడ్ జార్జ్

## ఒకరికి సంతానం లేదు మరొకరికి అతి సంతానం

ఇద్దరు వ్యక్తులు కుటుంబ నియంత్రణను గురించి మాట్లాడుకుంటున్నారు. అందులో ఒకడు సంతానహీనుడు మరొకడు కుచేలుడికి వారసుడు. మరొక మిత్రుడు వీరి సంభాషణలో కలుగ చేసుకుని "అయ్యా! మీలో ఒకరికి సంతానమే లేదు. మరొకరికి బహు సంతానం. అయినా మీరు కుటుంబ నియంత్రణను గురించి ఎలా మాట్లాడుకుంటున్నారో నాకు బొత్తిగా అర్థం కావటం లేదు" అన్నాడు.

## ప్రతి సంఘటనలో వెలుగును చూడండి!

ప్రతి సంఘటనలో ఒక వెలుగు తప్పక ఉంటుంది. ఆ కాంతిని చూడటం ఒక మంచి అలవాటు. ఈ అలవాటు సంవత్సరానికి వెయ్యి పౌండ్లు రాబడితో సమానం.

— శామ్యూల్ జాన్సన్

## వాస్తవవాదిగా ఉండు

నిరాశావాదిగా ఉండటం కన్నా ఆశావాదిగా ఉండటం మంచిది. కానీ అంతకంటే మిన్న అయినది వాస్తవవాదిగా ఉండటం.

— డా. పాల్ బ్రంటన్

## ఒకే మతం!

వంద పాఠాంతరాలు (Versions) ఉన్నప్పటికి ఈ ప్రపంచంలో ఉన్నది ఒకే ఒక మతం!

— బెర్నార్డ్ షా

'అష్ట మదాలకు మించిన మదం విద్యామదం. అది అంతరిస్తేనే ఆత్మతత్త్వం అలవడుతుంది."

# వాక్యూం ఫ్లాస్క్ కనుగొన్న వారెవరు?

ప్రస్తుతపు థర్మోస్ ఫ్లాస్క్‌కు అగ్రగామిగా ఉన్న వాక్యూం ఫ్లాస్క్ - 1842లో జన్మించిన ఒక ఉత్సాహ పూరితుడైన స్కాటిష్ ఔషధ విక్రేత - సర్ జేమ్స్ డెవార్




కనుగొన్నాడు. ఇది ఊహతో సృష్టించబడిన ఒక నవీన వస్తువు - ఒక రెండు గోడలుగల గాజుపాత్ర. ఈ రెండుగోడల నడుమనున్న గాలి ఒక పంప్ ద్వారా వెలుపలికి పంపటం జరుగుతుంది. దీనివల్ల ఈ పాత్రలోని ఏ ద్రవ పదార్థమైనా ఒక శూన్యస్థానంతో పరివేష్టించబడి ఉంటుంది. ఏ పదార్థం లేని శూన్యత ఇది.

ఈ వాక్యూం ద్రవాన్ని చల్లగా ఉంచి వేడికాకుండా అరికడుతుంది. పరిసరాల్లోని గాలి ద్వారా వేడి ప్రసరించదు కనుక ఇల జరుగుతుంది. అయినా, వేడికిరణ ప్రసారం వాక్యూం వల్ల నిలిపివేయబడదు. ఇది అనంతరం వచ్చిన ఫ్లాస్కులలో సరిచేయటం జరిగింది. వీటి గోడల్ని వెండితో పూత వేసి వేడికిరణ ప్రసారాన్ని తగ్గించటం జరిగింది.

# మొట్టమొదటి భారతీయ విమాన దళాధిపతి




మొట్టమొదటి భారతీయ విమాన దళాధిపతిగా పని చేసిన ఘనత ఎర్ మార్షల్ సుబ్రోటో ముఖర్జీకు దక్కుతుంది.

## క్విజ్

బీహారు రాష్ట్ర రాజధాని నగరం పాట్నా పాతపేరేమిటి?
(ఎ) కౌశాంబి, (బి) పాటలీపుత్ర, (సి) కన్నౌజ్, (డి) కపిలవస్తు.



ఏ వార్తాపత్రిక ప్రారంభానికి జవహర్ లాల్ నెహ్రూగారు సహాయపడ్డారు?
(ఎ) పయొనీర్, (బి) సర్చ్‌లైట్, (సి) ఇండియన్ నేషన్, (డి) నేషనల్ హెరాల్డ్.
ప్రపంచం ఎదుర్కొంటున్న అతిపెద్ద ప్రమాదం ఏది?
(ఎ) వరదలు, (బి) అంటువ్యాధులు, (సి) పరమాణు సంబంధ అస్త్రాలు (డి) విపరీతంగా పెరుగుతున్న జనాభా.
కాయగూరల్లో లోపిస్తున్న పోషక పదార్థాలకు కారణం?
(ఎ) ఉడికించడం, (బి) వేపుడు, (సి) ఆవిరిలో వండడం, (డి) కాల్చడం.

5. 'ఏ' విటమిన్ ఎక్కువగా లభించే కూరగాయలు:
(ఎ) కారెట్, (బి) బంగాళాదుంపలు, (సి) బచ్చలికూర, (డి) గోంగూర.
6. భోపాలు ప్రసిద్ధికి కారణం అక్కడి:
(ఎ) ఇనుము ఉక్కు పరిశ్రమ, (బి) వస్త్ర పరిశ్రమ, (సి) సిల్కు పరిశ్రమ, (డి) భారీ ఎలక్ట్రికల్స్ పరిశ్రమ.
7. ప్రతి సంవత్సరం 'జ్ఞాన్ పీఠ్' బహుమతి ఎవరికి ఇవ్వబడుతుంది?
(ఎ) రాజకీయ నాయకుడికి, (బి) క్రీడాకారుడికి, (సి) శిల్పికి, (డి) రచయితకు.
8. భారత రాజ్యాంగం ప్రకారం రాష్ట్రపతి పదవికి పోటీ చేయడానికి కావలసిన కనీస అర్హత:
(ఎ) 35 సంవత్సరాలకు పైబడిన వయసు, (బి) సోషలిస్టు దృక్పథం, (సి) పార్లమెంటు వ్యవహారాల అవగాహన, (డి) బి.ఏ/బి.ఎస్‌సి. పట్టం.

## గొప్ప గగన దండయాత్ర

*1944 సెప్టెంబర్‌లో హాలెండ్ (పశ్చిమయూరప్) లోని అర్న్‌హెమ్ సమీపంలో "ఆపరేషన్ మార్కెట్ గార్డెన్" అనే గొప్ప గగన దండయాత్ర జరిగింది. ఈ కార్యక్రమంలో 34,000 బ్రిటిష్ మరియు అమెరికన్ వాయుసేన, 2,800 విమానాలు మరియు 1,600 గ్లైడర్స్ పాల్గొన్నాయి.*

ఎరిన్ రౌలండ్

ఒకే ఒక కొమ్మున్న ఖడ్గమృగం జాతి ప్రస్తుతం భారత ఉపఖండంలో మాత్రమే ఉంది. ఆసియాకు చెందిన మరో రెండు రకాల ఖడ్గమృగాలు ఇంతకు ముందు మనదేశంలో ఉండేవి. కాని సుమారు నూరు సంవత్సరాల ముందు వేటగాళ్ళు ఈ కోవకు చెందిన ఖడ్గమృగాలను ఇక్కడి నుండి తరిమివేశారు.




భారతదేశపు ఖడ్గమృగం భయంకరంగా ఉంటుంది. ఈ జంతువును చూడగానే బెదురు పుడుతుంది, ఈ మృగం భుజాల వెనుక ఉన్న మడతలు వీపు చివర వరకు విడవకుండా వ్యాపించి ఉండవు. ఇలా వ్యాపించి ఉండకపోవడమే ఈ మృగం ప్రత్యేకత. చుక్కలుతో చదునైన అతుకులతో కూడిన బొప్పిలాంటి కవచాలు చూపరుల కంటికి ఈ మృగం ఒక ఆయుధాల టాంకులా కనబడుతుంది. ఖడ్గమృగం ఒక విధంగా మనల్ని చాలా మోసగించే జంతువు. రోమరహిత చర్మం నిజంగా చాలా పలచనిది. మెత్తగా ఉండే ఈ చర్మంలో చక్కని సరఫరాతో కూడిన రక్త నాళాలు ఉన్నాయి. తక్కువ దూరం 'దౌడు' తీస్తున్నప్పుడు గంటకు 50 మైళ్ళ వేగంగా పరుగెత్తగలదు.

ఖడ్గమృగం కొమ్ము నిజం చెప్పాలంటే కొమ్ము కాదు. ఇందులో సారవంతమైన ఎముక అసలు లేదు. కెరాటిన్ (ఎముక, పంజా, గోరు, వెంట్రుక ఇత్యాదుల నిర్మాణానికి అవసరమయ్యే పోషక పదార్థం) ప్రోగులను బాగా ఒత్తికట్టినట్లూ, గుఱ్ఱపు డెక్కల్లా ఈ కొమ్ము నిర్మాణం జరుగుతుంది. దీని సరాసరి పొడవు 20 సెంటీ మీటర్లు ఉంటుంది. చిన్న వయస్సులో కొమ్మును లాగేస్తే ఈ కొమ్ము మరొకసారి పుట్టుకొస్తుంది.

భారతదేశపు ఖడ్గమృగం ఎత్తుగా పెరిగే పచ్చిక, రెల్లు పెరిగే బురదనేల గలిగిన అడవులలో ఉండేందుకు బాగా ఇష్టపడుతుంది. ఏపుగా పెరిగే గడ్డిని, నీటిలో పెరిగే ఒక రకం పూలను, ఆకులను, చిన్న రెమ్మలను వేలులా ఉండే పైపెదవి సహాయంతో నోటిలో దోపుకుంటుంది. స్వేద గ్రంధులు లేని కారణంగా ఈ మృగంకు నీళ్ళ అవసరం ఎంతైనా ఉంది. ఎప్పుడూ ఈ జంతువు నీళ్ళలో ఈదుతూ, మునుగుతూ

ఎరిన్ రొలండే

ఒకే ఒక కొమ్మున్న ఖడ్గమృగం జాతి ప్రస్తుతం భారత ఉపఖండంలో మాత్రమే ఉంది. ఆసియాకు చెందిన మరో రెండు రకాల ఖడ్గమృగాలు ఇంతకు ముందు మనదేశంలో ఉండేవి. కాని సుమారు నూరు సంవత్సరాల ముందు వేటగాళ్ళు ఈ కోవకు చెందిన ఖడ్గమృగాలను ఇక్కడి నుండి తరిమివేశారు.




భారతదేశపు ఖడ్గమృగం భయంకరంగా ఉంటుంది. ఈ జంతువును చూడగానే బెదురు పుడుతుంది, ఈ మృగం భుజాల వెనుక ఉన్న మడతలు వీపు చివర వరకు విడవకుండా వ్యాపించి ఉండవు. ఇలా వ్యాపించి ఉండకపోవడమే ఈ మృగం ప్రత్యేకత. చుక్కలుతో చదునైన అతుకులతో కూడిన బొప్పిలాంటి కవచాలు చూపరుల కంటికి ఈ మృగం ఒక ఆయుధాల టాంకులా కనబడుతుంది. ఖడ్గమృగం ఒక విధంగా మనల్ని చాలా మోసగించే జంతువు. రోమరహిత చర్మం నిజంగా చాలా పలచనిది. మెత్తగా ఉండే ఈ చర్మంలో చక్కని సరఫరాతో కూడిన రక్త నాళాలు ఉన్నాయి. తక్కువ దూరం 'దౌడు' తీస్తున్నప్పుడు గంటకు 50 మైళ్ళ వేగంగా పరుగెత్తగలదు.

ఖడ్గమృగం కొమ్ము నిజం చెప్పాలంటే కొమ్ము కాదు. ఇందులో సారవంతమైన ఎముక అసలు లేదు. కెరాటిన్ (ఎముక, పంజా, గోరు, వెంట్రుక ఇత్యాదుల నిర్మాణానికి అవసరమయ్యే పోషక పదార్థం) ప్రోగులను బాగా ఒత్తికట్టినట్లూ, గుఱ్ఱపు డెక్కల్లా ఈ కొమ్ము నిర్మాణం జరుగుతుంది. దీని సరాసరి పొడవు 20 సెంటీ మీటర్లు ఉంటుంది. చిన్న వయస్సులో కొమ్మును లాగేస్తే ఈ కొమ్ము మరొకసారి పుట్టుకొస్తుంది.

భారతదేశపు ఖడ్గమృగం ఎత్తుగా పెరిగే పచ్చిక, రెల్లు పెరిగే బురదనేల గలిగిన అడవులలో ఉండేందుకు బాగా ఇష్టపడుతుంది. ఏపుగా పెరిగే గడ్డిని, నీటిలో పెరిగే ఒక రకం పూలను, ఆకులను, చిన్న రెమ్మలను వేలులా ఉండే పైపెదవి సహాయంతో నోటిలో దోపుకుంటుంది. స్వేద గ్రంథులు లేని కారణంగా ఈ మృగంకు నీళ్ళ అవసరం ఎంతైనా ఉంది. ఎప్పుడూ ఈ జంతువు నీళ్ళలో ఈదుతూ, మునుగుతూ ...

లేదా బురదలో దొర్లుతూ ఉంటుంది. ఎండాకాలంలో నీటి వసతి ఈ జంతువుకు చాలా చాలా అవసరం. ఈ జంతువు రోజుకు 80 మొదలు 100 లీటర్ల వరకు నీళ్ళు త్రాగుతుంది.

భారతదేశపు ఖడ్గమృగం సంఘజీవి. ఇతర జంతువులతో కలిసి మెలసి ఒక ప్రాంతంలో నివసిస్తుంది. తినటం, ఈదటం ఈ జంతువుకు చాలా ఇష్టం. కాని ప్రతి మృగానికి మేత మేసే స్థలం, పడుకునే స్థలం వేరు వేరుగా ఉంటాయి. ఆ స్థలాలలో అవి రాత్రిపూట లేదా మండుటెండలో మధ్యాహ్నం పూట విశ్రాంతి తీసుకుంటాయి.

ఆడ ఖడ్గమృగాలు మూడు సంవత్సరాలకే లైంగిక పరిపక్వతను పొందుతాయి. కాని మగ ఖడ్గమృగాలకు ఈ పరిపక్వత 7 మొదలు 9 సంవత్సరాల వయసు వరకు గానీ రాదు. ఆడ మృగాన్ని చూచిన మగ మృగం దాన్ని వెంబడిస్తుంది. ఒక దాన్ని మరొకటి తరుముకుంటూ కొన్ని గంటలపాటు రెండూ సంతోషంగా విహరిస్తూ కాలం గడుపుతాయి. ఆ తరువాత సంభోగం జరుగుతుంది.

ఇండో-గాంజెటిక్ సమతల ప్రదేశాల్లో మొట్టమొదట ఈ జంతువు విస్తృతంగా నివసిస్తూ ఉండేవి. అదేవిధంగా హిమాలయ పర్వతాల పీఠ ప్రాంతం - నేపాలు మొదలు అస్సాం-లో కూడా ఇవి విరివిగా ఉండేవి.

జావన్ (చిన్న సైజుది) తెగ ఖడ్గమృగాలు ఆకారంలోనూ, పొడుగులోను భారతదేశపు ఖడ్గమృగాల కన్నా చిన్నవి. అయితే భారతదేశపు ఖడ్గమృగాల కన్నా వెడల్పు గాను, బలిష్టంగానూ ఉంటాయి. ఈ తెగ ఖడ్గమృగాల కొమ్ము ఆకారంలో చిన్నగా ఉంటుంది. ఆడ ఖడ్గమృగాలకు అసలు ఉండనే ఉండదు. ఈ ఏకాంతజీవి ఇంతకు ముందు బెంగాల్, అస్సాం ప్రాంతాల లోనూ, మనదేశానికి తూర్పువైపున్న బర్మా, మలేషియా, సుమత్రా, జావాలలోనూ ఉండేది.

ఈ రోజు ప్రపంచంలో సుమత్రాన్ (సుమత్రాకు చెందిన రెండు కొమ్ములున్న ఖడ్గమృగం) తెగకు చెందిన 150 ఖడ్గ మృగాలు మాత్రం ఉన్నట్టు అంచనా వేయ బడింది. చిన్నసైజు ఖడ్గమృగాల ఎత్తు భుజాల వరకూ సుమారుగా 4-4 1/2 అడుగులు ఉంటుంది. రెండు కొమ్ము లున్నప్పటికి వెనుకనున్న కొమ్ము చాలా చాలా చిన్నగా ఉంటుంది.

— 'సిఐఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

## 41,000 బి.సి.లో త్రవ్వి తీసిన ఇనుప ఖనిజం

*వాయవ్య స్వాజిలాండ్ (దక్షిణ ఆఫ్రికా)లో నిగ్వేన్‌యా హిల్స్‌లో ప్రపంచంలో తొలిసారి గనులు త్రవ్వే కార్యక్రమం ప్రారంభమైంది. బాడీ పెయింట్ కోసం 41,000 బిసిలో ఇనుప ఖనిజం త్రవ్వి తీయబడింది.*

ప్రతి సంవత్సరం ఎండలు మెండుగా ఉన్న ప్రాంతాల్లోని అడవులను మనం నాశనం చేస్తున్నాం. ఇది స్విట్జర్లాండ్ దేశానికి మూడింతలు వైశాల్యమున్న ప్రాంతాన్ని నాశనం చేయటంతో సమానం.

బ్రిటిష్ శాస్త్రజ్ఞులు ఒక కొత్త రకమైన ఎలక్ట్రాన్ బీమ్ (కిరణ పుంజం లేక కిరణం) తయారీలో నిమగ్నులై ఉన్నారు. ఈ కిరణం సహాయంతో 29 ఖండాలున్న ఎన్సైక్లో పీడియా బ్రిటాన్నికా (విజ్ఞాన సర్వస్వం)ను ఒక గుండుసూది తలపై రాయడానికి అవకాశం ఉంటుంది.



* రాబోయే 20 సంవత్సరాలలో మన హిమాలయాలు బోసిపోనున్నాయి.

* మెదడులో అమర్చడానికి వీలున్న కంప్యూటర్‌ను తయారు చేయడానికి శాస్త్రజ్ఞులు ప్రణాళికలను వేసుకుంటున్నారు. జ్ఞాపకశక్తితో కూడిన పికోప్రాసెస్సర్‌ను భవిష్యత్తులో మనిషి పుర్రెలో అమర్చడానికి ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. కంప్యూటర్‌ను మెదడు ముందు భాగంలో అమర్చగలిగి నట్లయితే మనిషి కదిలే కంప్యూటర్ కాగలడు.




* ప్రతి రెండున్నర సెకన్లకి ప్రపంచంలో ఎక్కడో ఒక చోట ఒక బోయింగ్ విమానం దిగటమో లేదా ఎగరటమో జరుగుతుంది. ప్రతిరోజు ఈ బోయింగ్ విమానాలు 2 మిలియన్ల మందిని ఒక చోటి నుండి మరో చోటుకు చేరవేస్తున్నాయి.

— 'ఈస్ట్ అండ్ వెస్ట్ సీరీస్' సౌజన్యంతో

"విన్నవన్నీ విశ్వసించవద్దు, విశ్వసించినవన్నీ వెలిబుచ్చవద్దు."

నిశ్శబ్దం: ఇతరులకు లేదా నీకు లాభసాటిగా ఉన్నప్పుడే మాట్లాడు. అనవసర సంభాషణల జోలికి పోవద్దు.

క్రమబద్ధత: నీ వస్తువులన్నింటిని వాటికి తగిన స్థానంలోనే ఉంచు. ప్రతి పనికి ఒక నిర్ణీత సమయాన్ని కేటాయించు.




తీర్మానం: నీవు తప్పక చేయవలసిన పనినే చేసేందుకు తీర్మానించు. తీసుకున్న నిర్ణయాన్ని తప్పక పూర్తి చేయి.

తక్కువ ఖర్చు: ఇతరుల లేదా నీ స్వంత లాభానికి మాత్రమే ఖర్చు చేయి. దేన్నీ వ్యర్థ పరచవద్దు.

పరిశ్రమ: సమయాన్ని పోగొట్టుకోవద్దు. ఉపయోగకరమైన పనులనే చేయి. పనికి మాలిన పనులను చేపట్టవద్దు.

సద్భావన: వంచన చేయవద్దు. న్యాయంగా, అమాయకంగా ఆలోచించు మాట్లాడ వలసి వస్తే న్యాయంగా అమాయకంగా మాట్లాడు.

న్యాయం: చెడు చేసి ఇతరులను గాయ పరచ వద్దు. ఇతరులను లాభవంచితులను చేయవద్దు. ఇది నీ విద్యుక్త ధర్మం కాదు.

మధ్యేమార్గం!: ఆగ్రహావేశాలకు అతిగా గురి కావద్దు. తగిన మోతాదులోనే ఆ రెండింటిని ఉంచు.

శుభ్రత: శారీరక అశుభ్రతను, వాతావరణ అశుభ్రతను, వస్త్రాల అశుభ్రతలను ఏ మాత్రం సహించవద్దు.

ప్రశాంతత: చిన్న చిన్న విషయాలను గురించి మనసు పాడుచేసుకోకు.

— బెంజమిన్ ఫ్రాంక్లిన్

# మనిషిని విషం నుండి రక్షించే వన్యమూలిక

*బలోడా బజార్ (మధ్యప్రదేశ్)లో ఒక వింత జరిగింది. గబ్బోమియా అనబడే 60 ఏండ్ల వృద్ధుడు పాముకాటుకు గురి అయ్యాడు. గబ్బో మియా గూటంలా ఉండిపోయాడు. కాని అతన్ని కరచిన పాము 15 నిముషాల్లో చచ్చిపోయింది. ఇది ఎలా జరిగింది. గబ్బోను ప్రశ్నించగా "ఏముంది కొన్ని సంవత్సరాలుగా సొంధా కుచేలా అనే వన్యమూలికను తింటున్నాను. ఈ మూలిక పాము కాటుకు చక్కటి విరుగుడు" అన్నాడట. ఈ సంఘటన 1978లో జరిగింది.*

## కీర్తిశేషులు డా. ప్రొఫెసర్ వి. పెరుమాళ్

బైబిల్‌లో వాడబడిన అనేక నామ వాచకాలు ఆంగ్లభాషలో బాగా కలసిపోయాయి. ఇంగ్లీషు చదువుకున్నవారు ఈ పేర్లను అంతర్జాతీయ స్థాయిలో స్వీకరించారు.



ఒక పెద్ద మనిషిని గురించి చెప్పాలనుకున్నప్పుడు అతడు డేవిడ్ (David) లాంటివాడు అని చెప్పండి. మీ పని సులువౌతుంది. అమలులో ఉన్న ఆనవాయితీ ప్రకారం ప్రపంచంలోని ఉత్తమ వివేకవంతుడు సొలమన్ (Solomon) డేనియల్ (Daniel) ఒక న్యాయబద్ధమైన న్యాయాధీశుడు. ఆ దృష్టితో ఆలోచించినప్పుడు "అతను న్యాయబద్ధమైన న్యాయాధీశుడు" అని చెప్పకుండా డేనియల్ లాంటి న్యాయాధీశుడు అంటే చాలు. ఆ వ్యక్తి గొప్పతనం అందరికి అర్థమవుతుంది. బైబిల్‌లో వచ్చే జాబ్ (JOB) ఓపికకు, సహనానికి మారుపేరుగా గుర్తింపబడ్డాడు. ఈ సుగుణాలున్న వ్యక్తిని మనం జాబ్ (Job)గా పిలువ వచ్చును. ఇతరులకు సహాయపడేందుకు సాయశక్తులా శ్రమించే వ్యక్తిని సమారిటన్ లేదా ఒక మంచి సమారిటన్ (good Samaritan) అని మనం ఈ రోజు పిలుస్తున్నాం. రూత్ (Ruth) విశ్వాసమున్న అణకువ గల స్త్రీ. విశ్వాసం అణకువ ఉన్న ఏ స్త్రీనైనా సరే మనం నిస్సంకోచంగా ఒక 'రూత్' అని పిలవవచ్చును.

శామ్సన్ (Samson) శక్తి అతని కేశ రాశిలో ఉండేది. అందుకని అత్యధిక బలసంపన్నుడైన వ్యక్తిని మనం సామ్సన్ అని పిలుస్తున్నాం. బెంజమిన్ (Benjamin) కడగొట్టు ముద్దుల బిడ్డ. అందుకే ఇంటి

## ప్రపంచంలో త్వరితంగా అభివృద్ధి చెందే రెండోనగరం

*ఇండియాలో ఉత్తమ పారిశ్రామిక సంబంధాలు కలిగిన రాష్ట్రంగా కర్ణాటక పేరొందింది. మెక్సికో తరువాత బెంగుళూరు - ప్రపంచంలో శీఘ్రగతిలో అభివృద్ధి చెందే నగరంగా రూపొందింది.*

— (ఎకనామిక్ టైమ్స్)

"ప్రేమ అనేది మానవునకు గొప్పవరం. భగవంతుని స్వరూపాలైన సర్వప్రాణులను ప్రేమించడమే నిజమైన భక్తి."

లోని కడగొట్టు ముద్దుల బిడ్డను మనం బెంజమిన్ అంటున్నాం. నమ్మక ద్రోహంకు మించిన క్షమించరాని పాపం ఈ భూ ప్రపంచంలో మరొకటి లేదు. ఏసు ప్రభువు శిష్యుడు జూడాస్ (Judas) ప్రభువైన ఏసును కొన్ని వెండి నాణాలకై మోసం చేశాడు. ఈ రోజుకు కూడా అప్రతిష్ఠపాలైన దేశద్రోహిని మనం జూడాస్ అనే పిలుస్తున్నాం.

జోసెఫ్ (Joseph) - మేరీలు (Mary) తమ గుణ శీలాలకు పాతీవ్రత్యానికీ మారుపేర్లుగా చిత్రీకరించబడ్డారు. వీరే నాజరెత్ (Nazareth)కు చెందిన జీసస్ క్రైస్ట్‌కు తల్లిదండ్రులని మనందరికి బాగా తెలుసు. ఏమాత్రం మచ్చలేని శీలవంతుణ్ణి మనం ఒక జోసెఫ్ (Joseph) అంటున్నాం. అదేవిధంగా నూటికి నూరుపాళ్ళు కన్యత్వం చెడని పునీత స్త్రీని మనం మేరీ అంటున్నాం.

శిలువ చేయడం అన్నమాటకు అర్థం క్రాస్ ఆకారంలో ఉన్న చెక్క స్తంభంపైనున్న ఏసుక్రీస్తు చిత్రం. క్రాసుకు కట్టి మనిషిని చంపడాన్ని శిలువ చేయడం అంటారు. ఆంగ్లంలో క్రాసు (Cross) క్రూసిఫిక్స్ (Crucifix) క్రూసిఫై (Crucify), క్రూసిఫిక్షన్ (Crucifixion) ఇత్యాదులు చాలా వాడుకలో ఉన్నాయి. దీనికి కారణం ఏసుక్రీస్తుకు ఈ మాటలతో ఉన్న సంబంధమే.

ఆంగ్లేయ భాషా సాహిత్యాలతో పాటు ఆంగ్లేయ సంస్కృతి పురోభివృద్ధికి లెక్కకు లేని బైబిల్ మాటలు సహాయపడ్డాయి. భాషాశాస్త్రపరంగా పదాల అర్థాల పరంగా బైబిల్‌కు ఒక భాండాగారానికున్న స్థానం ఉంది. చక్కటి ఆంగ్లభాషా ప్రయోగానికి బైబిల్ ఎంతో సహాయపడుతుంది.

## పోస్టల్ సేవింగ్స్ బ్యాంక్




*ఈశాన్య యూరప్‌లో గణతంత్ర దేశం - ఫిన్లాండ్‌లో పోస్టల్ సేవింగ్స్ బ్యాంక్‌ను "పోస్టీ పంక్కీ" అని పిలుస్తారు. ఫిన్లాండ్‌లో ఒక పోస్టల్ సేవింగ్స్ బ్యాంక్ స్థాపన కోసం 1886లో ఒక సామ్రాజ్య సంబంధమైన ఫర్మానా (ఆజ్ఞా పత్రం) జారీ చేయబడింది. 1958లోనే ఫిన్లాండ్‌లో కంప్యూటర్లను ఉపయోగించుకునే పద్ధతి ప్రారంభించి, ఆటోమాటిక్ భోగట్టా తయారీని ప్రవేశపెట్టిన మొట్టమొదటి బ్యాంక్ మరియు వాణిజ్యసంస్థ - "పోస్టీపంక్కీ." "పోస్టీపంక్కీ" బ్యాంక్ శతాబ్ది ఉత్సవాలను పురస్కరించుకుని ఫిన్లాండ్ ఒక తపాలాబిళ్ళను విడుదల చేసింది. ఈ తపాలాబిళ్ళలో కేంద్ర ఆకృతి - ఒక సమన్వయ విద్యుద్వలయం - ఒక కంప్యూటర్ మూల పదార్థానికి ప్రాతినిధ్యం వహిస్తుంది. ఇది బ్యాంక్ వ్యవహారాలలో ఆటోమేషన్‌కు సంకేతంగా నిలుస్తుంది.*

— *కబితారాయ్*

పథకం వేయబడిన గొప్పపనుల కంటే పూర్తిచేసిన స్వల్పమైన పనులే శ్రేష్ఠమైనవి."



1.వివేకి మనసుకు కళ్ళెం వేయగలడు, మూర్ఖుడు మనసుకు బానిస అవుతాడు.
— పుబ్‌లిలియస్ సిరస్

2.తనకు దొరికిన అవకాశాల కన్నా ఎక్కువ అవకాశాలను ఏర్పర్చుకునేవాడే వివేకి. —జార్జ్ హెర్బర్ట్

3.తన పనిని సాధించడానికి ఇతరుల మేధను ఉపయోగించుకునే వాడే గొప్పవాడు. —డోన్ పియట్

4.చెడుచింతనతో కూడిన మాటలను త్రవ్వి తీసెడువాడు తన మానసిక శాంతిని కోల్పోతాడు. —సెనెకా

5.స్థిర చిత్తుడు విధిని, చపలచిత్తుడు అవకాశాన్ని నమ్ముతారు.
—బెంజమిన్ డిజ్రేలి

6.కర్తవ్య నిర్వహణాభావం మనిషిని నరకయాతనకు గురిచేసినా అదే అద్భుతాలను సాధించేందుకు కూడా ఉపయోగపడుతుంది. —హెచ్.ఎల్.మెన్కన్

7.మర్యాద, ఓర్పు ఒకమంచి మనిషికి ఉండవలసిన ఉచిత లక్షణాలు. వీటిని మించిన మంచి లక్షణాలు లేవు.
—సిసెరో

8.నిజాయితీ గల వ్యక్తి తన న్యాయమైన సందేహాన్ని ఎప్పటికీ వదులుకోలేడు.

9.అనుభవాల కారణంగా కాకుండా అనుభవాలకు కావల్సిన స్థోమతపై మనిషి వివేకం ఆధారపడి ఉంటుంది.
బెర్నార్డ్ షా

10.ఒక గొప్ప వ్యక్తి గొప్ప పరిస్థితులను ఎదుర్కొనగల లేక సృష్టించగల గుణాలను కలిగి ఉంటాడు. —జె.ఆర్.లొవెల్

11.రాజనీతిజ్ఞుడు అవకాశాన్ని సృష్టిస్తాడు. అవకాశం రాజకీయనాయకుడిని సృష్టిస్తుంది.
—జి.ఎస్. హిల్లార్డ్

— సేకరణ: పద్మా వెంకటరామన్

## చమురు నిలువలున్న ప్రముఖదేశాలు

సౌదీ అరేబియా, రష్యా, కువైట్, ఇరాన్, మెక్సికో, ఇరాక్, యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్, అమెరికా సంయుక్త రాష్ట్రాలు, లిబియా, చైనా ఇత్యాదులు.

"ఒకే విషయాన్ని ఇతరులు చూసినట్లే చూసి, కొంత భిన్నంగా ఆలోచించటం లోనే పరిశోధన ఆధారపడి ఉన్నది."

"రవిత్రం

శీఘ్రగతితో అభివృద్ధి చెందిన మూలధనం బజార్లూ (Capital Markets) ఆర్థిక సేవా రంగాలూ (Financial Services) కొత్త విద్యాక్షేత్రాలలో తర్ఫీదు పొందిన వారికి సవాలును ఎదుర్కోగల జీవనోపాధులను సమకూరుస్తున్నాయి. ది ఇన్స్టిట్యూట్ ఆఫ్ చార్టర్డ్ ఫైనాన్షియల్ అనాలిస్ట్స్ ఆఫ్ ఇండియా(ICFAI) వారు డిప్లొమా ఇన్ బిజినెస్ ఫైనాన్స్ (DBF) లాంటి కొన్ని కొత్త కార్యక్రమాలను రూపొందించారు. కార్పొరేట్ (సామూహిక) ఫైనాన్స్, మర్చంట్ బాంకింగ్, కాపిటల్ మార్కెట్, ఇంటర్నేషనల్ (అంతర్జాతీయ) ఫైనాన్స్ ఇత్యాది రంగాలలో డిగ్రీ కాలేజి విద్యార్థులకు సఫలమైన జీవనోపాధి కల్పించేందుకు డిప్లొమా ఇన్ బిజినెస్ ఫైనాన్స్ కోర్సును వారు తీర్చిదిద్దారు.

ఈ డిబిఎఫ్ (DBF) కార్యక్రమంలో డిగ్రీ కాలేజి విద్యార్థులు వారు ఏ శాఖకు చెందిన వారైనా సరే - కళలు, విజ్ఞానం, వాణిజ్యం- పాల్గొనడానికి అవకాశాన్ని ఏర్పాటు చేశారు. అకౌంటింగ్, స్టాటిస్టిక్స్ (గణాంక శాస్త్రం) గణితాలలో ప్రవేశం ఉండాలన్న నియమం ఇక్కడ లేదు.

డిబిఎఫ్ ప్రోగ్రామును ఒక సంవత్సర కాలంలో పూర్తి చేయవచ్చును. ఆ తరువాత పరీక్షకు కూర్చోవడానికి అవకాశం కల్పిస్తారు. ICFAI వారు తమ ప్రోగ్రాముల్లో పాల్గొనే విద్యార్థులకు పాఠ్య పుస్తకాలతో సహా సమగ్రంగా రాయబడిన పఠన సామగ్రీను కూడా సరఫరా చేస్తారు. ఈ పరీక్షలో ఉత్తీర్ణులయిన వారికి డిగ్రీలతో పాటు కాలేజీలు/ విశ్వ విద్యాలయాలు వదిలే సమయానికి ICFAI వారి బిజినెస్ ఫైనాన్స్ డిప్లొమో కూడా లభ్యమవుతుంది.

—ఎల్.ఎమ్. పాటిల్

—'పార్థ' సౌజన్యంతో

## సరైన అవగాహన సామరస్యానికి దారి చూపుతుంది

*జీవకోటి నిర్మాణం ఒకేలా జరిగింది. ఒకరికి కలిగించే బాధ ఇతరులకు కూడా బాధను కలిగిస్తుంది. ఏదైతే ఒకరి కష్టాలను తగ్గించ గలుగుతుందో అదే ఇతరుల కష్టాలను కూడా తగ్గించగలదు. మనిషి మరియు ఇతరప్రాణుల నిర్మాణంలో కనబడే తేడా పరిమాణ పరంగానే ఉంది కాని తీరుపరంగా లేదు. అందరిలో సమానత్వం చూడడం అన్నదే సరైన అవగాహన. చెడు అవగాహన విరోధానికి దారి తీస్తుంది. సరైన అవగాహన సామరస్యానికి, ఐక్యతకు దారి చూపుతుంది.*

— బుద్ధుడు.

## అనుప్ కిషోర్ దాస్

దుర్గాపూజ శక్తిని ఉపాసించే శాక్తేయుల పండుగ. స్త్రీరూపంలో ప్రకటితమైన దైవీక సామర్థ్యాన్ని శక్తి అంటారు.



అతి ప్రాచీనకాలం నుండి మనదేశంలో భక్తులు శక్తిని ఉపాసిస్తూ వస్తూన్నారు. మహిషాసుర మర్దినిని మనం శక్తి స్వరూపిణిగా ఆరాధిస్తున్నాము. రాతి చెక్కడాలు మాత్రం కాకుండా దేశంలోని పలుప్రాంతాలలో దొరికిన ఈ దేవత టెర్రకోటా (మట్టిని నిప్పులో కాల్చే క్రియ) ఆకారాలు దుర్గాపూజా విధానం అన్ని ప్రాంతాలలో ప్రబలంగా ఉండేదన్న వాస్తవాన్ని చాటి చెబుతున్నాయి.

శరదృతువులో ఆచరింపబడే ఈ పండుగను 18 వ శతాబ్దం మధ్యకాలంలో బెంగాలు నవద్వీపానికి చెందిన మహారాజు కృష్ణ చంద్రరే (1710 - 1782) గారు మొట్టమొదట ప్రచారంలోకి తెచ్చారని అందరూ భావిస్తున్నారు.

మనకున్న పండుగలలో బాగా ఖర్చుతో కూడిన పండుగ ఈ దుర్గాపూజ పండుగ. అందుకని ఈ పండుగను ధనవంతులు, జమీందార్లు, సుబేదార్లు, వర్తకులు, మొదలైనవారు మాత్రం ఆచరించేవారు. ఆధునికయుగంలో అనేక సంస్థలు, సభలు, క్లబ్బులు, సమాజాలు వెలసాయి. వీరందరూ కలసి ఈ దేశపు తూర్పు ప్రాంతం పండుగను భారీ ఎత్తులో జరపడం ప్రారంభించారు. ఆకారణంగా ఈ పండుగ ఒక సామాజిక పండుగగా ఈ రోజు మారింది.

సమాజంలో భావాత్మక ఏకతను వ్యాపింపజేయడానికి ఈ దుర్గాపూజా

## నగరాల్లో త్రాగేనీటి తలసరి లభ్యం

*రోజుకు త్రాగేనీరు తలసరి వాడకం లభ్యత - గాంధీనగర్ (గుజరాత్) లో 600 లీటర్లు, లక్నోలో 266 లీటర్లు, కలకత్తాలో 235 లీటర్లు, బొంబాయిలో 130 లీటర్లు, పాట్నాలో 110 లీటర్లు, మద్రాసులో 70 లీటర్లు-గా ఉన్నది.*

"శ్రద్ధ, ఒక నిశ్శబ్దమైన మరియు నిరంతర పొగడ్త."

పండుగ ఎంతగానో ఉపయోగపడుతున్నది. ప్రజల్లో సన్నిహితత్వపు ఉత్సాహాన్ని పెంచడంలో కూడా ఈ పండుగ



ప్రముఖపాత్రను వహిస్తున్నది. కరుణామయి దుర్గామాత బెంగాలులోని ప్రతి ఇంటా వెలసి వారికి అభయమిస్తున్నట్లు అక్కడివారు విశ్వసిస్తారు. క్రూరత్వం నుండి, నిరంకుశత్వం నుండి తమను కాపాడే ఏకైక శక్తిగా బెంగాలీలు దుర్గామాతను భావించి ఆరాధిస్తారు.

వింధ్యకు దక్షిణ ప్రాంతానికి చెందిన తమిళనాడు కర్ణాటకలో ఈ దుర్గాపూజ పండుగను నవరాత్రి దసరా పేరుతో ఎంతో వైభవంగా, ఎంతో ఆడంబరంగా జరుపుకుంటారు.

కర్ణాటకలో ఈ పండుగను అటు ప్రజలు, ఇటు ప్రభుత్వం ఇద్దరు వైభవో పేతంగా జరుపుకుంటారు. విజయదశమి రోజున ప్రజలు, ప్రభుత్వ అధికారులు, దేశ విదేశాలకు చెందిన ప్రముఖులు స్వయంగా ఇందులో పాల్గొంటారు.

తమిళనాడులో మాత్రం ఈ పండుగ ఇండ్ల వరకే పరిమితం. దేవి గౌరవార్థం ఇక్కడివారు నవరాత్రులను జరుపు కుంటారు. దేవి తొమ్మిది అవతారాల నెత్తి నట్లుగా మార్కండేయ పురాణం చెబు తుంది. అందుకే ప్రతి ఇంట్లో తొమ్మిది మెట్లను కట్టి బొమ్మలను కళాత్మకంగా ఈ మెట్లపై అలంకరిస్తారు. ఈ అలంకరణ

## అధికారం సామర్ధ్యాన్ని దెబ్బతీస్తే.



Dr. S. Radhakrishnan

మన అవకాశాలు గొప్పవే కానీ, అధికారం సామర్ధ్యాన్ని అధిగమిస్తే మనం అరిష్టంలోకి పడిపోతామని నన్ను హెచ్చరించనివ్వండి.

— డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్

"ప్రారంభపు లోపాలను చిట్టచివరి విజయాలుగా మార్చుకునే సామర్ధ్యం ఒక ఆశావాదికే ఉంటుంది."

లలో దేవతల బొమ్మలు, పౌరాణిక నాయకుల బొమ్మలు, పీఠాధిపతుల బొమ్మలతో భుజాలు రాసుకుంటూ దేశ నాయకుల బొమ్మలు, అంతర్జాతీయ ఖ్యాతి గాంచిన వ్యక్తుల బొమ్మలు నిల బడతాయి.

బొమ్మల కొలువు రోజులలో చుట్టు పక్కల ఉన్న బంధుమిత్రులను కొలువు చూడడానికి రమ్మని ఆహ్వానిస్తారు. పేరంటానికి వచ్చిన అతిథులు దేవతల మహిమను వర్ణించి వారి ఆశీస్సులను కోరే పాటలు పాడుతుంటారు. ఆ తరువాత రుచికరమైన ఆహార పదార్థాలను పంచి పెడతారు. యువతులు, స్త్రీలు అప్పుడ ప్పుడు కొన్ని వర్గాలుగా ఏర్పడి సంప్రదాయ బద్ధమైన కుమ్మి, కోలాటాల నృత్యాలను చేస్తారు. చుట్టు పక్కలున్న వారితో సత్సంబంధాలు కలిగి ఉండాలని, బంధు మిత్రుల ఇళ్ళకు వస్తూ పోతూ ఉండాలని పరస్పర అవగాహన కలిగి ఉండాలని తెలియ జేయడమే ఈ పేరంటాళ్ళ ఉద్దేశ్యం.

9 వ రోజున కార్ఖానాలన్నూ, ఇతర సంస్థలను మూసి వేస్తారు. ఆ రోజు యంత్ర సామాగ్రిని పూజించి వాటిని గౌరవిస్తారు. యంత్రశాల ఉపకరణాలనూ, సంగీతజ్ఞులు తాము పవిత్రంగా పరిగణించే సంగీత వాద్యా లను, కుమ్మరులు చక్రాల్ని మొదలైన వాటిని శుభ్రం చేసి పూలతో అలంకరిస్తారు. ఆశీస్సుల కోసం పుస్తకాలను పూజాగృహంలో ఉంచడం గానీ లేదా దగ్గరున్న గుళ్ళకు తీసుకు పోవడం కానీ చేస్తారు.

పదవరోజును దశమి అంటారు. దశమి రోజుతో ఈ పండుగ ముగుస్తుంది. ఈ శుభ దినాన వాణిజ్యపరమైన కొత్త పనులను ప్రారంభిస్తారు. సాధారణంగా పిల్లలు తమ మొదటి పాఠాన్ని ఈ రోజుతో ప్రారంభిస్తారు.

— 'రోటరీన్యూస్' సౌజన్యంతో

## 1994 విశ్వసుందరి




*భారత సుందరి సుస్మితాసేన్ - ఢిల్లీకి చెందిన 18 సంవత్సరాల వయస్సు గల ఇంగ్లీష్ ఆనర్స్ విద్యార్థిని - మనిలా (ఫిలిఫ్ఫీన్స్)లో మే 21 న జరిగిన అంతర్జాతీయ సౌందర్యవతుల వేడుకలో విశ్వసుందరిగా ఎంపికయింది. ఈ అందాలపోటీలో ప్రపంచమంతటి నుంచి 76 దేశాలు పాల్గొన్నాయి. 43 సంవత్సరాల కాలంలో ఈ ప్రతిష్ఠాకరమైన బిరుదు గెలుచు కున్న ప్రథమ భారతీయురాలు ఈమె.*

"మనం స్వల్పంగా తెలుసుకున్నప్పుడు మాత్రమే మనం ఖచ్చితంగా తెలుసుకుంటాము; జ్ఞానంతో సందేహం ప్రవేశిస్తుంది.

## చెప్పిన జోస్యం నిజమైంది

1969వ సంవత్సరం జనవరి 16వ తారీఖున శ్రీ జోసఫ్ డెలోసీ (Joseph Delouise) చికాగోలోని ఒక బారులో ప్రవేశించి సరిగ్గా రాత్రి 11 గంటలకు చికాగో నగరానికి దక్షిణ ప్రాంతంలో రెండు రైళ్ళు గుద్దుకుంటాయని ప్రకటించాడు. రెండు గంటలలో ఆయన చెప్పినట్లే జరిగింది.

## అల్సేషియన్ కుక్కల ఆమరణ ఉపవాసం!

తమ యజమాని మరణించాడని తెలిసిన రెండు అల్సేషియన్ కుక్కలు ఒక్క చుక్క మంచినీళ్ళు త్రాగకుండా ఒక పిడికెడు అన్నం తినకుండా ఆమరణ ఉపవాసం చేసాయి. ఈ సంఘటన 1979లో అస్సాం రాష్ట్రానికి చెందిన కోట్‌కోటేలో జరిగింది. ఈ కుక్కలను తినిపించాలని అక్కడివారు శతవిధాల ప్రయత్నించారు. కాని కుక్కలు మాత్రం తినకుండానే ప్రాణాలను విడిచాయి.

## చూడవచ్చిన వారిని దూషించలేదు

1967లో వాషింగ్టన్ నగరానికి చెందిన జంతు ప్రదర్శనశాల అధికారులు 24 గంటలు ఒక మైనా పక్షి మరియు ఆస్ట్రేలియాకు చెందిన కాకటూ (Cockatoo - ఒక జాతి చిలుక) చెప్పిన మాటలను శ్రద్ధగా విన్న తరువాత, జంతు ప్రదర్శనశాలకు విచ్చేసిన వ్యక్తులను ఆ పక్షులు దూషించలేదు అన్న నిర్ణయానికి వచ్చారు.

## తియ్యటి నీటి నగరం

అమెరికాకు చెందిన టెక్సాస్ రాష్ట్రంలోని స్వీట్‌వాటర్ నగరానికి బిట్టర్ క్రీక్ నుండి నీరు సరఫరా చేయబడుతుంది.

## 87 కిలోల బరువున్న 11 సంవత్సరాల బాలుడు

మహారాష్ట్రలోని యియోత్‌మల్ (Yeotmal) జిల్లాకు చెందిన థాంకీ గ్రామవాసి గజానంద్ శివశంకర్ 11 సంవత్సరాల బాలుడు. అయితే ఈ బాలుడి బరువు మాత్రం 87 కి.గ్రా.లు!

## ఆనాటి వార్తలు

## 2000 సంవత్సరాల క్రిందటి సూర్య భగవానుడి విగ్రహం

*ఉత్తరప్రదేశ్‌లో డియోరియా జిల్లాకు చెందిన తుర్క్‌పట్టీ మహువా గ్రామంలో 2000 సంవత్సరాల పురాతనమైన సూర్య భగవానుడి విగ్రహాన్ని 1982 లో కనుగొన్నారు. ఏడు గుర్రాల రథాన్ని నడుపుతున్నట్టుగా సూర్యుడి విగ్రహం చెక్కబడి ఉంది.*

గొప్ప గ్రంథాలు సమకాలీనపు కంఠధ్వనులు; ఉత్కృష్టమైన సాహిత్యం కాలాతీతమైనది."

ఒక సంతలో రకరకాల ఆకారాలు, పలురకాల రంగుల్లో ఉన్న బెలూన్లను చాలా ఆసక్తితో ఒక నీగ్రో కుర్రాడు చూస్తూ నించున్నాడు.

ఉన్నదున్నట్టు ఒక ఎఱుపు రంగు బెలూను దారం తెగింది. దారం తెగిన బెలూను ఆకాశంలో పైపైకి ఎగురుతూ కంటికి కనబడనంత పైకి వెళ్ళిపోయింది. ఈ దృశ్యం అక్కడ గుమిగూడిన జనాన్ని బాగా ఆకర్షించింది. మరో బెలూను దారం తెంచి ఆకాశంలో ఎగురనిస్తే బాగా వ్యాపారం కావచ్చు అనుకున్నాడు, బెలూన్లను అమ్మే వ్యక్తి వెంటనే తన చేతిలో ఉన్న పసుపు పచ్చ రంగు బెలూను ధారాన్ని తెంపి గాలిలోకి వదిలాడు. ఆ తరువాత తెల్లటి బెలూనును వదిలేశాడు.

ఆ నీగ్రో కుర్రాడు చాలాసేపు అక్కడే నుంచొని గాలిలో ఎత్తుగా ఎగురుతున్న బెలూనులను చూస్తూ ఉండిపోయాడు. కొన్సేపయిన తరువాత "మీరు ఇప్పుడు నల్లరంగు బుడగను వదిలారనుకోండి. అప్పుడు అది కూడా ఇంతకు ముందు గాలిలో ఎగిరిన బెలూన్ల ఎత్తుకు ఎగరగలదా?" అని అడిగాడు.

బెలూన్లు అమ్మే వ్యక్తి కుర్రాడిని బాగా అర్థం చేసుకున్న వాడిలా నవ్వుతూ నల్ల రంగు బెలూనును వదిలాడు. ఆ తరువాత "చూడబ్బాయి. భెలూను గాలిలో రంగు కారణంగా కాదు బెలూనులో ఉన్న గాలి కారణంగా ఎగురుతుందని" సమాధానం ఇచ్చాడు.

— "కేతలిక్ డైజెస్ట్" సౌజన్యంతో

## క్రికెట్ వార్తలు

### గొప్ప బాట్స్‌మన్



అన్ని కాలాలకు చెందిన గొప్ప బాట్స్‌మన్ సర్ డోనాల్డ్ బ్రాడ్‌మన్. 338 ఫస్టుక్లాస్ ఇన్నింగ్స్ 28,067 పరుగులు చేశాడు (సగటున 95.14). తన 80 టెస్ట్ ఇన్నింగ్స్‌లో అతడు 6,996 పరుగులు చేశాడు. సగటున 99.94 మొత్తం మీద .ఒక ఆస్ట్రేలియన్ బాట్స్ మన్‌కు ఇదొక రికార్డు.

"ఒక వర్తకుడు అమ్మదగ్గ సరకుల్ని విమర్శిస్తే దానికి కారణం: అతడు దాన్ని కొనదలచడమే."

# [illegible]దేశ ప్రధానమంత్రులు



జవహార్ లాల్ నెహ్రూ
(1889 – 1964)
ఆగస్టు 15, 1947 – మే 27, 1964



గుల్జారీలాల్ నందా
(1898 – )
మే 27, 1964 – జూన్ 9, 1964 (తాత్కాలిక)
జనవరి 11, 1966 – జనవరి 24, 1966 (తాత్కాలిక)



లాల్ బహదూర్ శాస్త్రి
(1904 – 1966)
జూన్ 9, 1964 – జనవరి 11, 1966



శ్రీమతి ఇందిరాగాంధీ
(1917 – 1984)
జనవరి 24, 1966 – మార్చి 24, 1977
జనవరి 14, 1980 – అక్టోబరు 31, 1984



మొరార్జీ దేశాయ్
(1896 – )
మార్చి 24, 1977 – జూలై 28, 1979

Chandra


(1902-1987)
జూలై 28,1979,- జనవరి14,1980


రాజీవ్ గాంధీ
(1944 - 1991)
అక్టోబర్ 31,1984-డిసెంబరు1,1989


విశ్వనాథ్ ప్రతాప్ సింగ్
( 1931 - )
డిసెంబరు 2,1989 - నవంబరు 10,1990


చంద్రశేఖర్
( 1927 - )
నవంబరు 10,1990 - జూన్ 21,1991


పి.వి.నరసింహారావ
( 1921 - )
జూన్ 21,1991- ఇప్పటివరకు

# ఫిలిప్పైన్స్

7107 దీవులు కలయిక వల్ల ఏర్పడిన దేశం రిపబ్లిక్ ఆఫ్ ఫిలిప్పైన్స్. ఇది పశ్చిమ పసిఫిక్ మహాసాగరంలో దక్షిణ ఆసియా తీర ప్రాంతానికి 800 కి.మీ.ల దూరంలో ఉంది. 299,404 చ.కి.మీ.లు ఈ దేశం యొక్క విస్తీర్ణత.




సుమారు 730 దీవులలో జనసంచారం ఉన్నది.. దేశం విస్తీర్ణతలో 95 శాతం విస్తీర్ణత 11 దీవులలో కేంద్రీకృతమయి ఉంది. ఈ దేశం మొత్తం జనాభా 65,200,000. 90 శాతం జనాభా 11 విశాల దీవులలో నివసిస్తున్నది. ఉత్తరాన ఉన్న లుజాన్ (Luzon) దేశం దీవులలో అతి ముఖ్యమైన దీవి. అన్ని దీవులకు సమతల కోస్తా ప్రాంతాలున్నాయి. ఈ సమతల ప్రాంతాలలో చిన్న పెద్ద కొండల పర్వతాలు ఉన్నాయి.

ఈ దేశం వాతావరణం వెచ్చగాను ఆహ్లాదకరంగానూ ఉంటుంది. ఇక్క‹ వర్షపాతం ఎక్కువగా ఉంటుంది. తూరు తీర ప్రాంతాలు వేడిగా ఉంటాయి. ఇక్క‹ వాతావరణంలో తేమ కూడా ఉంటుంది.

ఇక్కడి ఫిలిపినోస్ (Filipinos) దేశీయు‹ మలే (Malay) సంతతివారు. సుమార 2,100 సంవత్సరాల క్రితం మలే జాతివార ఆగ్నేయ (southeast) ఆశియా ప్రాంత‹ నుండి ఈ దీవులకు వలస వచ్చారు. 16‹ శతాబ్దంలో యూరప్ దేశవాసులు ఈ ప్రాంతానికి మొట్టమొదటిసారి వచ్చినప్పుడ ఈ ప్రాంతంవారు వేటగాళ్ళుగా, చేపలు పట్టే వాళ్ళుగా, స్థిరపడని వ్యవసాయదారులు‹ ఉండేవారు. 1521లో స్పెయిన్ దేశం‹ పనిచేసే మగెల్లాన్ (Magellan) అ‹ పోర్చుగీసు నావికుడు ఈ దీవులకు వచ్చి‹

## 15 అంతసుల ఎతుగల ఓక్ వృక్షం

*బైలోరష్యాలోని బ్రెస్ట్ ప్రాంతంలో పోఝుఝిన్ - కోయే అరణ్య ప్రాంతంలో కనిపెట్టబడి‹ 800 ఏళ్ళనాటి ఓక్ వృక్షం 15 అంతస్తులున్న భవనం ఎత్తున ఉంటుంది.*

మొట్టమొదటి యూరప్ దేశస్తుడు.

1565లో స్పెయిన్ దేశం వారు ఆక్రమించి ఈ ప్రాంతాన్ని స్వాధీనం చేసుకుని తమ ఏలుబడిలోకి తీసుకున్నారు. వీరి పరిపాలన



Philippines Beach resort

300 సంవత్సరాలు సాగింది. ఈ దీవుల నామకరణం స్పెయిన్ దేశపు రాజు కింగ్ ఫిలిప్ II పేరిట జరిగింది. స్పానిష్-అమెరికన్ యుద్ధం తరువాత పారిస్ ఒప్పందం ప్రకారం 1898 డిసెంబరు 10వ తారీఖున స్పెయిన్ దేశం ఫిలిప్పైను దీవులను అమెరికా సంయుక్త రాష్ట్రాలకు దత్తం చేసింది.

రెండవ ప్రపంచ సంగ్రామం రోజుల్లో జపాను ఫిలిప్పైన్స్‌ను 1941 డిసెంబర్ 8వ తారీఖున ముట్టడించింది. 1942 మే నెల వరకు జరిగిన ఈ యుద్ధంలో ఫిలిప్పైన్స్ ఓడిపోయింది. మిత్రదేశాలకు సంబంధించిన సైన్యం జపాను వారిని ఫిలిప్పైన్స్ నుండి 1945 సెప్టెంబర్ నెలలో తరిమి వేసింది. 1946వ సంవత్సరం జూలై నెల 4వ తారీఖున ఫిలిప్పైన్స్ ఒక స్వతంత్ర దేశంగా ఆవిర్భవించింది. అమెరికా సంయుక్త రాష్ట్రాల ప్రభుత్వాన్ని ఆదర్శంగా పెట్టుకుని వీరు తమ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకున్నారు.

1970 నుండి తీవ్రవాదులూ, గెరిల్లా సభ్యులు ఇక్కడ అధికమయ్యారు. అప్పుడప్పుడు రాడికల్స్ (తీవ్రవాదులు)గా పిలువబడే యువత సంక్షోభాన్ని సృష్టిస్తూ వచ్చింది. 1972లో ఫిలిప్పైన్స్ అధ్యక్షుడు మార్కోస్ (Marcos) మార్షల్ లాను (మిలటరీ పరిపాలనను) ప్రకటించి భూసంస్కరణలను తెచ్చి పెరుగుతున్న ధరలను అదుపులోకి తేగలిగాడు. కాని దినదిన ప్రవర్ధమానంగా పెరుగుతున్న జనాభా దారిద్ర్యాన్ని, నిరుద్యోగ



People of Philippines

సమస్యను బాగా పెంచింది. క్రమంగా రాజకీయాల్లో లంచగొండితనం శిఖర స్థాయిని చేరుకుంది. అధ్యక్షుడు మార్కోస్

"తనను తాను ప్రేమించుకునే మనిషిని ప్రజలు ద్వేషిస్తారు."

1973 జనవరి 17వ తారీఖున కొత్త రాజ్యాంగాన్ని అమలుపరచాడు. కొత్త రాజ్యాంగం ప్రకారం శ్రీ మార్కోస్ అధ్యక్షుడిగా ఎన్నిక అయ్యాడు.



Woman from Philippines

1986 వరకు అధ్యక్షుడు మార్కోస్ పదవిలో కొనసాగాడు. చట్టాన్ని ఏర్పరచే అధికారం అతని చేతులలోనే ఉండేది. 1986లో జరిగిన అధ్యక్షుని ఎన్నికలలో మాజీ ప్రతిపక్ష నాయకుడు కీ.శే. బెనిగ్నో అక్వినో (Benigno Acquino) (వీరు చంపబడ్డారు) సతీమణి కొరాజోన్ అక్వినో (Corazon Acquino)ను ఓడించి మళ్ళీ ఒకసారి మార్కోస్ అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. ఈ ఎన్నికలు సజావుగా జరగలేదన్న విమర్శ ఆ రోజులలో ప్రచారంలో ఉండేది. ఎన్నికలలో జరిగిన అవకతవకలకు తమ వ్యతిరేకతను తెలియ స్తూ సైన్యానికి చెందిన అధికారులు తమ తమ రాజీనామాలను అధ్యక్షుడు మార్కోస్‌కు అందజేశారు. అధ్యక్షుడు మార్కోస్ 20 సంవత్సరాల పరిపాలన 1986 ఫిబ్రవరి నెల 26వ తారీఖున అంతమొందింది. వెంటనే శ్రీమతి అక్వినోను దేశ అధ్యక్షురాలిగా ఫిలిప్పైన్స్ ప్రభుత్వం గుర్తించింది. మొట్టమొదటి స్వతంత్ర ఎన్నికలు, గత 20 సంవత్సరాలలో, మొదటి సారిగా1 992 మే నెలలో జరిగాయి. జనరల్ ఫిడల్ రమోస్ (Gen. Fidel Ramos) అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. 1992 జూన్ నెల 30వ తారీఖు నుండి ఆయన ఫిలిప్పైన్స్ అధ్యక్షుడుగా కొనసాగుతున్నాడు.

ఫిలిప్పైన్స్ దేశంలో 73 రాష్ట్రాలు, 61 నగరాలున్నాయి. ఈ దేశం నాణెం పేరు పెసో (Peso). ఈ దేశం ప్రజల తలసరి ఆదాయం 730 డాలర్లు. ఈ దేశంలో 90 శాతం అక్షరాస్యత ఉంది. దేశం జనాభాలోని 47 శాతం జనం వ్యవసాయ సంబంధమైన పనులను చేస్తున్నారు. 20 శాతం జనం వాణిజ్య పరిశ్రమలలో పని చేస్తున్నారు. 13 శాతం ప్రజలు ఉద్యోగస్తులు.

ఈ దేశ ప్రజలు ఇంగ్లీషును మాట్లాడుతారు. ఇంగ్లీషు మాట్లాడే దేశాలలో అమెరికా బ్రిటన్‌ల తరువాత ఈ దేశమే మూడవ స్థానంలో ఉంది. జాతీయ భాష ఫిలిపినోను అన్ని ప్రాంతాలవారు విస్తృతంగా మాట్లాడుతారు, అర్థం చేసుకుంటారు. ఫిలిపినో, ఇంగ్లీషు, స్పానిష్ భాషలను ఈ దేశం అధికార భాషలుగా గుర్తించింది. ఈ దేశంలో మొత్తం 111 మాండలిక భాషలు, 87 భాషలు ఉన్నాయి.

83 శాతం ప్రజలు రోమన్ కాథలిక్ మతావలంబీకులు. వీరితోపాటు ఈ

'ఒక వివేకవంతుడు నెమ్మదిగా వెళ్ళినా తన లక్ష్యానికి నిశ్చయంగా చేరుకుంటాడు.''

దేశంలో ప్రొటెస్టెంట్ క్రైస్తవులు, మహమ్మదీయులు, బౌద్ధులు కూడా ఉన్నారు.

దేశం వైశాల్యంలో 42 శాతం భాగం అరణ్యాలతో నిండి ఉంది. దేశ విస్తీర్ణతలోని 1/5 భాగం నేల సాగుబడిలో ఉంది. వరి, కొబ్బరికాయలు, మనీలా జనపనార, చెఱకు, మొక్కజొన్న, పొగాకు, అరటి, అనాసపండ్లు,


Manila (Philippines)

ఇత్యాదులు ఈ దేశపు వ్యవసాయ పంటలలో ముఖ్యమైనవి. కలప మరియు ఇతర అడవులతో సంబంధించిన వస్తువులను ముఖ్యంగా ఎగుమతి కోసం వాడతారు. కుట్టుపని, ఎండు తాటాకులతో చేయబడిన టోపీలు, నేయబడ్డ గుడ్డలు, చాపలు, కుమ్మరుల హస్తకళతో సంబంధించిన వస్తువులు మొదలైన వాటిని ఈ దేశీయులు తమ తమ ఇండ్లలోనే తయారు చేస్తారు.

ఈ దేశపు పరిశ్రమలలో ముఖ్యమైనవి - ఆహార వస్తువుల తయారీ, వస్త్రాలు, ఔషధాల తయారీ, రసాయనిక వస్తువుల తయారీ, జౌళీ, చెక్క సామానుల తయారీ, ఎలక్ట్రానిక్స్‌ల అసెంబ్లీ మొదలైనవి.

- వెండి, ముతక ఇనుము, బంగారం, క్రోమైటు, నికెల్, మాంగనీసు, కోబాల్ట్, జింక్, బొగ్గు, రాగి, జిప్సమ్ మొదలైనవి ఈ దేశపు ఖనిజ సంపదలో అమూల్యమైనవి.

చక్కెర, కొబ్బరి నూనె, రాగితో గాఢం చేయబడిన వస్తువులు, గిటక కొబ్బెర, అరటిపండ్లు మొదలైనవి ఈ దేశపు అతి ముఖ్యమైన ఎగుమతి సరకులు.

బాస్కెట్ బాల్, బేస్‌బాల్, వాలీబాల్, టెన్నిస్, బాక్సింగ్, గోల్ఫ్, ఈత మొదలైనవి ఇక్కడి సుప్రసిద్ధ ఆటలు. పోటీ పడగల క్రీడాకారుల కోసం ప్రతి సంవత్సరం సైకిల్ మరాథాన్ పోటీలను, కారు ర్యాలీలను వీరు తప్పక నిర్వహిస్తారు. ప్రతి వారాంతంలోనూ సెలవు రోజులలోనూ గుఱ్ఱపు దౌడు పోటీలు జరుగుతాయి. ద్వీపాలు, బీచిలున్న ఈ దేశపు నీటి ఆటలు చాలా ఉత్తమ శ్రేణికి చెందినవి.

లుజాన్ (Luzon) దీవిలోని మనిలా పట్టణం ఈ దేశపు అతి విశాలమైన ప్రాంతం. ఈ నగరాన్ని ఆ దేశపు వాణిజ్య కేంద్రంగా

## ప్రపంచంలో గడియారాల అత్యధిక ఎగుమతిదారు

*స్విట్జర్లాండ్ మరియు జపాన్‌ల తరువాత విలువలరీత్యా పెద్దవాటిల్లో మూడవది, నాణ్యత రీత్యా ప్రపంచంలో అత్యధికంగా ఎగుమతి చేసేది - హాంగ్‌కాంగ్ (దూర ప్రాచ్యం).*

"సమర్థతకు పాఠశాల లేదు." టిర్సో సామెత

అక్కడి జనులు గుర్తిస్తారు. మనీలా నగర పరిసరంలో ఉన్న క్యూజోన్ (Quezon) నగరం ఈ దేశపు పరిపాలనా కేంద్రం.


President Fidel Ramos of Philippines

సకల సౌకర్యాలున్న హొటళ్ళు, డిస్కోలు కలిసి ఈ దేశపు రాత్రి జీవనాన్ని ఉత్తేజ పరుస్తాయి. మనీలా నగరం మనీలా ఖాతం పైనున్న నగరం. ఈ నగరంలోని ఓడరేవు అతి సహజమైన ఆదర్శ రేవు పట్టణంగా మొత్తం ప్రపంచంలోనే గుర్తించబడింది. ఈ దేశంలో అప్పటి స్పానిష్ పరిపాలకులు శాన్‌టో టోమస్ (Santo Tomas) విశ్వ విద్యాలయాన్ని 1611లో స్థాపించారు. మొత్తం ఫిలిప్పైన్స్ దేశంలో ఇంతటి ప్రాచీనమైన విశ్వ విద్యాలయం మరెక్కడా లేదు. సేబు (Cebu) డవావొ (Davao), (Iloilo) మరియు పాసే (Pasay) ఈ దేశపు ముఖ్యమైన నగరాల్లో కొన్ని మాత్రమే.

లుజాన్ ద్వీపాలలోని మేయాన్ (Mayon) అగ్ని పర్వతం ఇక్కడి యాత్రాస్థలాల్లో అతి ముఖ్యమైనది. ఈ అగ్నిపర్వతం ఆకృతి ఒక చక్కటి శంఖు ఆకారంలో చెక్కబడినట్లు ఉంటుంది. ఇంత చక్కటి ఆకృతిగల అగ్నిపర్వతం ప్రపంచంలో మరెక్కడా లేదు. ఇక్కడి బనాయీ టెరేసెస్ (Banauee Terraces) (వరి పంటకై వాడుతారు) భవ్యత ఆశ్చర్యాన్ని కలుగజేస్తుంది. నిటారు పర్వత పార్శ్వాలను 2000 సంవత్సరాల క్రితం ఇఫుగావో (Ifugao) ఆటవిక జాతివారు ఎంతో జాగ్రత్తగా చేత్తో మలచారట. లుజాన్ దీవిలో ఇది చూడతగ్గ స్థలం. ప్రపంచంలో అతి చిన్నదైన టాల్ (Taal) అగ్నిపర్వతం బటాన్‌గస్ (Batangas) దీవిలో టాల్ సరస్సులో అందంగా అమరింది. అప్పుడప్పుడు ఈ అగ్ని పర్వతం ఆగ్రహంతో గర్జిస్తుంది. బాసిలన్ అనబడే అగ్నిపర్వత దీవి రబ్బరు, కొబ్బరి తోటలకు చాలా ప్రసిద్ధి చెందిన ప్రాంతం.

ఈ దేశపు ఆర్థికాభివృద్ధి పెంపొందించాలన్న దృఢ నిశ్చయంతో ఫిలిప్పైన్స్ అధ్యక్షుడు రమోస్ న్యాయ సమ్మతమైన పరిపాలనను కొనసాగిస్తున్నారు.

## నా జస్సు

"విశ్వం యావత్తునూ దీప్తివంతం చేసే సూర్యునిలో స్వతస్సిద్ధమైన హక్కుగా ఉన్న *కాంతి ప్రకాశం, అగ్నిలోని మరియు చంద్రునిలోని కాంతి - నా దీవ్యమానమైన తేజస్సుగా తెలుసుకో."*

— *భగవద్గీత*

'ఒక వ్యక్తి ఏ విధంగా మరణించాడనేది ముఖ్యం కాదు, అతడు ఎలా జీవించాడనేది ముఖ్యం."

డాక్టర్ హెచ్.కె. బఖ్రూ

స్వాభావిక ఆహార పదార్థాలలో ముఖ్యమైనదిగా ఒకరు ఉల్లిగడ్డను అభి వర్ణించారు. మిగిలిన తాజా కూరగాయ లతో పోల్చితే, ఇది సాపేక్షంగా ఆహార విలువలలో హెచ్చుగానూ, ప్రోటీన్ వస్తువు లలో మితంగానూ, కాల్షియం, రిబోఫ్లావిన్, పొటాసియం, విటమిన్ 'ఎ' మరియు 'సి' మొదలైన వాటిల్లో విలువైనదిగానూ ఉంటుంది.



ఉల్లిగడ్డను లెక్కలేని పద్ధతుల్లో ఉపయోగించుకోవచ్చు. పక్వంకాని, పక్వ మైన దుంపలను ముడిగానే భుజించ వచ్చు లేదా ఒక కూరగాయ మాదిరిగా వండి తినవచ్చు.

ఉల్లిగడ్డ క్రిమిసంహారక గుణాలు కలిగి ఉన్నదనేది అనేక సంవత్సరాల నుండి తెలిసిన విషయం. రష్యన్ డాక్టర్ల ఆధునిక పరిశోధనలు దీన్ని ధృవీకరించాయి. వీరి అన్వేషణ ఫలితంగా ఒకవ్యక్తి ప్రతిరోజు ఒక ముడిఉల్లిగడ్డను నమిలి తిన్నట్లయితే, అతడు అనేక దంతవ్యాధుల నుంచి రక్షించబడతాడు. రష్యాకు చెందిన డాక్టర్ బి.పి. టోహ్కిన్ అభిప్రాయం ప్రకారం ముడి ఉల్లిగడ్డను మూడు నిమిషాల సేపు నమిలినా చాలు, అది నోటిలోని సూక్ష్మక్రిము లను నశింపచేస్తుంది.

కఫం, ఉమ్మికి సంబంధించిన గుణాలు ఉల్లిగడ్డలో ఉన్నాయని చెప్పబడుతున్నది. ఇది కఫాన్ని ద్రవపరచి , ఇంకా ఎక్కువ కాకుండా అడ్డగిస్తుంది. జలుబు , దగ్గు, బ్రాంకైటిస్, ఇన్ఫ్లుయెంజా, కీళ్ళవాపు, వాతరోగం, అల్పమూత్ర విసర్జన, కాలేయ వ్యాధులు మరియు వాపు పరిస్థితుల్లో - ఉత్తమ చికిత్సగా దీన్ని శతాబ్దాల నుండి వాడుతున్నారు. రాత్రి భోజన సమయంలో దీన్ని తిన్నట్లయితే - నిద్రలేమికి - శక్తి వంతమైన చికిత్సగా గణుతింపబడుతున్నది.

సులభంగా జీర్ణించుకునే ఇనుప వస్తువులు కలిగి ఉన్నట్లు ఉల్లిగడ్డలు ఖ్యాతి గడించాయి. కనుక ఇవి పాండురోగం (రక్తహీనత) మరియు మధుమేహం చికిత్సల్లో ఉపయోగకరంగా ఉంటాయి.

"చేతిలో ఏదైనా ఉన్నప్పుడు, దాని ఆకర్షణ పోతుంది."

— ఇరాకీ సామెత

ప్రపంచంలోని 132 మంది బిలియనీర్లలో ఐదవ స్థానంలోని వారు - యునైటెడ్ కింగ్‌డమ్‌కు చెందిన రెండవ ఎలిజబెత్ రాణి. ఆమె ప్రపంచంలోని అత్యంత భాగ్యవంతురాలైన స్త్రీ. ఆమెకు 6.5 బిలియన్ పౌండ్ల విలువ గల ఆస్తులు ఉన్నాయి.


SULTAN OF BRUNEI

అయినప్పటికీ ఆమె బకింగ్‌హామ్ పాలెస్‌లోని దీపాలను ఆర్పుతూ తిరుగుతూ ఉంటుందని ఫార్చ్యూన్ పత్రిక వ్రాసింది.

48 సంవత్సరాల వయస్సు గల సర్ ముడా హస్సనల్ బోల్కియ్యా - బ్రూనే (ఆగ్నేయ ఆసియా) సుల్తాన్ - ప్రస్తుతం ప్రపంచంలో అందరికంటే భాగ్యవంతుడుగా ఉన్నాడు. అతని ఆస్తి విలువ 31 బిలియన్ డాలర్లుగా ఫార్చ్యూన్ పత్రిక అంచనా వేసింది. అతనికి ఇద్దరు భార్యలు, ముగ్గురు కుమారులు, ఆరుగురు కుమార్తెలు ఉన్నారు. 1,788 గదులు గల భవనం కూడా ఉన్నది.

ప్రపంచంలోని రెండవ అత్యధిక భాగ్యవంతుడు సౌదీ అరేబియా రాజు ఫహద్. అతనికి 15 బిలియన్ డాలర్ల ఆస్తులున్నట్లు తెలుస్తున్నది.

అతని తర్వాత మూడో స్థానంలోకి వచ్చిన వ్యక్తి - 10 బిలియన్ డాలర్ల ఆస్తిగల అమెరికన్ కోటీశ్వరుడు రాబ్సన్ వాల్టన్. యునైటెడ్ స్టేట్స్‌లోని 1737 వాల్-మార్ట్ డిస్కౌంట్ స్టోర్సులకు అతడు యజమాని.

## నూరు సంవత్సరాలకు పైబడిన 4000 జనం ఉన్న జపాను

నూరు సంవత్సరాలకు పైబడినవారు జపాన్‌లో నాలుగువేలకు పైగా ఉన్నారు. రికార్డులు రాయడం ప్రారంభమైన తరువాత సంఖ్యాపరంగా ఇది పెద్ద రికార్డు. ఇందులో *100* సంవత్సరాలకు పైబడిన వృద్ధనారీమణుల సంఖ్య *3,330*. అంటే మొత్తం సంఖ్యలో ఇది *80.2* శాతం అన్నమాట. జపాను దేశంలో మహిళల నగటు ఆయుర్దాయం *82.11* సంవత్సరాలు. ఇది పురుషుల నగటు ఆయుః పరిమాణం *(76.11)* కన్నా ఆరు సంవత్సరాలు ఎక్కువ.

"ప్రతి ప్రజాస్వామ్యంలో ప్రతిభతో, జ్ఞానంతో, శీలంతో కూడిన ఒక సంపన్న వర్గం ఉండి తీరాలని నేను నమ్ముతాను."

— ఎన్.ఏ.పల్కీవాలా

ఒక అందమైన తోటలో ముద్దులొలికే చిన్న పూలమొక్కలా ఉండేవాడిని. నా బాల్యంలో, తరుణావస్థలో, యౌవనంలో ప్రేమ, అనురాగాలనే నీరు పోసి నన్ను పెంచారు. చిన్న చెట్టు పెరిగి పెరిగి పెద్ద మానులా తయారయినట్లే దోగాడే చిన్న శిశువు పెరిగి దయవాత్సల్యతలతో కూడిన వ్యక్తిగా మారాడు.

నిజం, నిజాయితీ, స్వయంశిక్షణ ఇత్యాదులు ఎరువుగా పనిచేసాయి. దయ, సరైన దృక్కోణం, సక్రమ ఆలోచనలు, మంచి అలవాట్లు ఇత్యాదులను మొదటి నుండి నాలో నాటి వికసింపజేశారు.

ఏపుగా పెరిగిన వృక్షం ప్రకృతిలోని కఠినమైన వాస్తవాలను - మాడ్చే ఎండలు, ఎముకలు కొరికే చలి, కుండపోత వర్షం మొదలైన వాటిని - ఎదుర్కొనే స్థితికి వచ్చింది. ఆ చిన్ని మొక్కకు మొదటి నుండి లభించిన శిక్షణ కారణంగానే నేడు అన్నిరకాల పరిస్థితులను ధైర్యంతో ఎదుర్కో గలుగుతున్నది. మొక్కలాగే నేను కూడా జీవితాన్ని చవి చూచాను.

నా నిర్ణయాలు, నా ఆలోచనలు, నా భావాలు ఇప్పుడు స్వంతంగా నావే. ఇలాగే ఉండమని నన్ను మొదటి నుండీ ప్రోత్సహిస్తూ వచ్చారు. నేను తప్పు చేయనంత వరకు అన్ని విషయాలకు సంబంధించిన నిర్ణయాలను, నాకు నచ్చిన విధంగా తీసుకుంటూ వస్తున్నాను. నేను దారి తప్పితే నాకు దారి చూపబడుతుంది. ఏమివచ్చినా నేను ధైర్యంతో, నవ్వుతూ ఎదుర్కోగలనన్న నమ్మకం ఇప్పుడు నాకు వచ్చింది. నాలోని ఈ మార్పులకు తోటమాలి లాంటి మా నాన్నే కారణం. ఆయన నిజంగా అద్భుతమైన మనిషి. అతనికి శతకోటి అభివాదాలు.

— 'ఫెమీనా'

## విజయం సాధించిన 10 హిచ్‌కాక్ చిత్రాలు



ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్‌కు చెందిన అత్యంత విజయవంతమైన పదిచిత్రాలు ఇవి: సైకో, రేర్ విండో, నార్త్‌బై నార్త్‌వెస్ట్, ఫామిలీ ప్లాట్, టార్న్ కర్టెన్, ఫ్రెన్‌జీ, వెర్టిగో, ది మాన్ హూ న్యూ టూమచ్, ది బర్డ్స్ మరియు స్పెల్‌బౌండ్.

"అరమరికలు లేని వ్యవహారం - ఆచరణలో పెట్టటం కంటే ఎక్కువగా పొగడబడుతుంది."

## నిజ జీవితంలో పౌర సంబంధాలు

ఒక అబ్బాయి ఒక అమ్మాయి పట్ల ఆసక్తి చూపించి, తన గుణగణాలను వివరిస్తూ ఆ అమ్మాయి పేర ఒక ఉత్తరం రాస్తే అది ప్రకటన అవుతుంది.





ఉత్తరం రాయకుండా స్వయాన వెళ్ళి తన గురించి బాకా ఊదితే అది 'వస్తువు విక్రయకళ'గా పరిగణింపబడుతుంది.

పైరెండు విధాల కాకుండా ఆ అమ్మాయి మంచి స్నేహితుణ్ణో/స్నేహితురాలినో బయట భోజనానికి తీసుకువెళ్ళి తన గురించి, తన మంచిని గురించి ఆ స్నేహితుడికి అర్థం అయేలా తెలియజేస్తే అది పౌరసంబంధం అవుతుంది.

## నా అలవాట్లు మీ అలవాట్లంత చెడ్డవి కావు!

తనింటికి భోజనానికి రమ్మని ఒకసారి లేడి రాన్‌డల్ఫ్ ప్రముఖ నాటక రచయిత బెర్నార్డ్ షాను ఆహ్వానించింది. ఆహ్వానానికి బదులుగా షా ''నేను ఖచ్చితంగా రాలేను. అందరికీ సుపరిచితమైన నా స్వంత అలవాట్లపై దాడి చేయడానికి నేను మిమ్మల్ని ఎలా రెచ్చగొట్టానో తెలియడం లేదు'' అని ఒక తంతి పంపాడు. సమాధానంగా లేడీ రాన్‌డల్ఫ్ తంతి ద్వారానే ఇలా జవాబిచ్చింది: ''మీ అలవాట్లను గురించి నాకు బొత్తిగా తెలియదు. అయినా మీ అలవాట్లు నా అలవాట్లంత చెడ్డవి కావనుకుంటాను.''

## మనదేశ ఈశాన్య ప్రాంతం జలశక్తి

*మనదేశ ఈశాన్య ప్రాంతం జలశక్తి దృష్ట్యా చాలా శక్తివంతమైన ప్రాంతం. 40,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని జలరాసితో ఉత్పత్తి చేయవచ్చునని అంచనా వేయబడింది. ఇది మనదేశంలోనే అత్యధిక జలవిద్యుచ్ఛక్తి ఉత్పాదక ప్రాంతం. మనదేశంలో లభ్యమవుతున్న వనరులలో ఇది 30 శాతం భాగమవుతుంది. కాని 3 శాతం కంటే తక్కువ జలవిద్యుచ్ఛక్తిని మాత్రం మనం తయారు చేసుకుని ఉపయోగించుకుంటున్నాం.*

[illegible] అనే [illegible] శ్రమ అనే చేదునుంచి లభిస్తుంది.''
— అల్జీరియన్ సూక్తి

## డా. అమూల్య మొహాపాత్ర

ఆలోచనల అసాధారణ ప్రభావం ఆలోచించే వ్యక్తిపై పడుతుంది. మనం ఎలా ఆలోచిస్తామో అలా తయారవుతాము. ఉత్తమ ఆలోచనలు మనిషిని ఉత్తముణ్ణి చేస్తాయి. సుందరమైన ఆలోచనలు మనిషి సౌందర్యాన్ని పెంచితే చెడు ఆలోచనలు మనిషిని కురూపిగా తయారు చేస్తాయి. ఆలోచనలను బట్టి మెదడు, మెదడును బట్టి మనిషి.



మనిషి మేధలో ఆలోచనలు నదిలో నిరంతరం పారే నదిలా నిరాఘాటంగా ప్రవహిస్తూనే ఉంటాయి. ఏదో ఒక ఆలోచన చేయకుండా మెదడు ఒక నిమిషం కూడా ఉండలేదు. ఆలోచనల స్థాయి మనం ఆలోచించే విషయాలపై, మనసును లగ్నం చేసే విషయాలపై ఆధారపడి ఉంటుంది. మంచి పుస్తకాలు, ఉత్తమ వ్యక్తులు, గొప్ప కోరికలు, స్ఫూర్తినిచ్చే ఆదర్శాలపై మన ఆలోచనా సరళి ఆధార పడి ఉంటుంది. మన ఆలోచనల రంగు కాంతి వంతం లేదా కాంతి విహీనం కావడం కూడా పైన చెప్పిన విషయాల పైనే ఆధారపడి ఉంటుంది.

వక్రమార్గంలో ముందుకు పోవడమే బుద్ధి స్వభావం. మెదడు అదుపులోకి రాని, కళ్ళెం లేని గుర్రంలాంటిది. చంచల మైన మెదడు ఏకాగ్రతవైపు నడవడానికి ఇష్టపడదు. సాధ్యమైనంత దూరంగా పోవ డానికి ప్రయత్నిస్తుంది. సుఖసంతోషాల అన్వేషణలో మెదడు అటు ఇటూ తిరుగు తూనే ఉంటుంది. ఈ తిరుగుడును అరి కట్టడం అసాధ్యం.

## భూటాన్‌లో విలక్షణమైన తపాలా బిళ్ళలు

అత్యంత విలక్షణమైన తపాలాబిళ్ళల నిర్మాత - హిమాలయ రాజ్యం భూటాన్. ఈ దేశం సువాసనలో వెదజల్లే ఒక తపాలా బిళ్ళల వరుసను విడుదల చేసింది. వీటి రోజా పూల చిత్రాలు ఉన్నాయి. అందువల్లనే అవి సువాసనలు వెదజల్లాయి.

— 'మిషా' సౌజన్యంతో

అదుపు లేని మెదడును అదుపులో ఉంచుకునేందుకు కొన్ని మార్గాలున్నాయి. అందులోని మొట్టమొదటి మార్గం ఒక నిర్దిష్టమైన లక్ష్యాన్ని ఎన్నుకుని రోజూ అన్ని పనులు ఆ లక్ష్యాన్ని దృష్టిలో ఉంచుకుని చేసే అలవాటును చేసుకోవాలి. ప్రతి పని మన ముందుకు ఎలా వస్తుందో అలానే గ్రహించి మన ఆలోచనల్ని పూర్తిగా కేంద్రీకృతం చేసుకునే అలవాటును కూడా పెంచుకోవాలి. అంతేకాని సగం దృష్టిని ఆపనిపై సారించడం చేయరాదు.

ఎడ తెగకుండా అభ్యాసం చేయండి. మీ మనసులోకి దూసుకువస్తున్న ఆలోచనల నుండి ఒక ఆలోచనను ఎన్నుకునే అలవాటును చేసుకోండి. వస్తున్న ఆలోచనలు బయటి నుండి వస్తున్నవో లేక మనం కల్పించుకున్నవో మొదట తెల్సుకోవాలి. మంచి చెడు ఆలోచనల మధ్యనున్న భేదాల్ని గుర్తించే విచక్షణా జ్ఞానం మన మెదడుకుండాలి. అవాంఛనీయ ఆలోచనలు రాకుండా చూసుకోవాలి.

మనసులోకి చొచ్చుకు వస్తున్న ఒక చెడ్డ ఆలోచన నుండి విముక్తి పొందాలంటే ఒక సులువైన మార్గం ఉంది. మీ ఆలోచనలను మంచి ఆలోచనల వైపు వెంటనే మళ్ళించండి. ఈ విధంగా మన మెదడును మంచి ఆలోచనల వైపు, మంచి భావాలవైపు, మంచి పనుల వైపు మళ్ళించేందుకు సతతం ప్రయత్నం చేస్తూ ఉండాలి.

మన మెదడుకు చురుకుతనం అలవాటు చేయాలి. బయటి నుండి వచ్చే ఆలోచనల పట్ల నిశ్చిత వైఖరిని అలవాటు చేసుకుని మన మానసిక ఆరోగ్యానికి దోహదకారి అయేలా వాటిని మార్చుకోవాలి. ఈ అలవాటు కారణంగా మెదడు క్రమక్రమంగా పరిశుభ్రం కాగలదు. అంతమాత్రమే కాకుండా మెదడుకు కావల్సిన సుస్థిరతను కూడా ప్రసాదించి ఏకాగ్రతకు, ధ్యానానికి రాచబాటను వేయగలదు.

అస్థిరమైన మెదడును వశపరచుకునేందుకు ప్రాణాయామాన్ని మౌనవ్రతాన్ని పాటించడం మంచిది. అదుపులో ఉన్న, సమరసంతో కూడిన క్రమబద్ధమైన ఆలోచనలు శారీరక విశ్రాంతికి మంచి ఆరోగ్యానికి సోపానాలు కాగలుగుతాయి.

## అతి సుప్రసిద్ధ నటులు, నటీమణులు

స్పెన్సర్ ట్రేసీ, ఎలిజబెత్ టేలర్, కాథరీన్ హెబ్బర్న్, లారెన్స్ ఆలివర్, లియోనెల్ బ్యారిమోర్, గ్రేటా గార్బో, ఇన్‌గ్రిడ్ బర్గ్‌మన్, బెట్టి డేవిస్‌లను మనం నిత్యనూతన నటులు, నటీమణులుగా గుర్తింప వచ్చును.

## తేనెటీగల పరాగ సంపర్కం అవసరం

లక్షకుపైగా పూలరకాలకు తేనెటీగల ద్వారా జరిగే పరాగ సంపర్కం పుష్పించేందుకు చాలా అవసరం. తేనెటీగలు లేకుండా ఈ మొక్కలు బ్రతకలేవు.

"ఆకలి - వంటలోని తప్పులెంచదు."

## ఫిర్యాదుల శాఖకు బదిలీ అయింది



మొదటి గుమాస్తా: అయ్యోపాపం, శేఖర్‌కు చెవులు బొత్తిగా వినబడటం లేదు. చెవుడు కారణంగా అతని ఉద్యోగం ఊడుతుందేమో!

రెండో గుమాస్తా: వాడికి జీతం పెంచారు అంతటితో ఆగకుండా ప్రమోషనిచ్చి ఫిర్యాదుల శాఖకు బదిలీ చేశారు.

## తల వెంట్రుకలను వెతికేందుకు రెండింతలు వసూలు చేస్తాం

ఖాతా దారుడు: అయ్యా! నా తలపై వెంట్రుకలే లేవు. అయినా అందరూ ఇచ్చుకున్నంత నేనూ ఇచ్చుకోవాలా?

సెలూన్ యజమాని: అవునండి. అప్పుడప్పుడు కొంచెం ఎక్కువగా కూడా ఇవ్వాల్సి ఉంటుంది. వెంట్రుకలను వెతికి కత్తిరించేందుకూ సాధారణంగా మేము రెండింతల సొమ్ము వసూలు చేస్తాం.

## నీవు సరాసరి వ్యక్తులను మించిపోయావు

భార్య: శాస్త్రజ్ఞుల అంచనా ప్రకారం ఒక సగటు వ్యక్తి రోజుకు 10,000 ల మాటలను వాడుతాడట.

భర్త: అవునవును నీవు సరాసరి వ్యక్తులను మించిపోయావన్న మాట గుర్తుంచుకో.

## మధ్యాహ్నం వారు రారు

నిర్మానుష్యంగా ఉన్న కచేరీలో ప్రవేశించిన వ్యక్తి కాపలాదారుడితో, "మధ్యాహ్నం పూట ఇక్కడి వారు పనిచేయరా?"

కాపలాదారుడు: "అయ్యా! ఇక్కడివారు ప్రొద్దున పూట మాత్రం పని చేయరు. ఇక మధ్యాహ్నం అంటారా అసలు రానే రారు."

## నన్ను వాతావరణం సూచించే వ్యక్తిగా భావిస్తున్నారా?

ఇంటి యజమానితో అద్దెకున్న వ్యక్తి: "అయ్యా కప్పు తెగ కారుతుంది. వాన తెగ కురుస్తుంది. మరెంత కాలం భరించ మంటారు?"

"ప్రతి తరం తన పూర్వీకుల్ని దూషిస్తుంది."

యజమాని: "నన్నెందుకు అడుగుతున్నారు. నన్ను వాతావరణం సూచించే [..]గా భావిస్తున్నారా?"

## అద్దంపై ఝుంకారం చేస్తున్న తుమ్మెద ఆడ తుమ్మెద

చిన్న మీనూ గదిలో మూడు తుమ్మెదలు ఝుంకారం చేస్తూ తిరగసాగాయి. మీను తల్లి దగ్గరికెళ్ళి "అమ్మా! తిరుగుతున్న మూడు తుమ్మెదలలో అద్దంపై తిరుగుతున్న తుమ్మెద మాత్రం ఆడ తుమ్మెద" అని నిర్ధారించి చెప్పింది.

తల్లి: "అది ఆడ తుమ్మెదేనని నీకు ఎట్లా తెలిసింది!"

మీనూ: "మరి రెండేమో బీరు బాటిల్ చుట్టూ తిరుగుతున్నాయి. అవి తప్పక మగ తుమ్మెదలు. మూడవ తుమ్మెద మాత్రం అద్దం చుట్టూ తిరుగుతూంది. అది తప్పక ఆడ తుమ్మెదే."

## ప్రారంభించే ముందే 'షూట్' చెయ్యి

ఒక పెద్ద మనిషి తన ఉపన్యాసాన్ని ప్రారంభించేందుకు మైకు ముందు నిలబడి గొంతు సరిచేసుకుంటున్నాడు. ఆ పెద్ద మనిషి మాట్లాడుతున్నప్పుడు ఒక మంచి కోణం నుండి ఫొటో తీయాలని ఫొటోగ్రాఫరు అటునుంచి ఇటు, ఇటునుంచి అటు తిరగసాగాడు. ఫొటోగ్రాఫరు అటు ఇటు తిరగడం సభాధ్యక్షుడు సహించలేదు. వచ్చిన పెద్దమనిషి ఎక్కడ కోప్పడి అర్థాంతరంలో ఉపన్యాసం ఆపుచేసి పోతాడో అన్న భయంతో ఆ ఫొటోగ్రాఫర్‌ను పిలిచి "ఆయన మాట్లాడుతున్నప్పుడు ఫొటో తీయవద్దు. ఆయన ప్రారంభించే ముందే ఆయన్ను షూట్ చెయ్యి" అన్నాడు.

## నీవు స్వంతంగా తయారు చేసిన వస్తువు నివ్వు

కొడుకు: "నాన్నా నేను సాధించిన అభివృద్ధికి గుర్తుగా విలువైన బహుమతి ఇవ్వడం కంటే మీరు సొంతంగా సంపాదించిన దాన్ని కానుకగా ఇవ్వండి.

"అదేమిటి?"

కొడుకు: డబ్బు!

## అవునండి గాడిదలు మామిడి పండ్లు తినవు

మీర్జా గాలిబ్‌కు మామిడి పండ్లంటే పంచ ప్రాణాలు. మిత్రులతో కలిసి మామిడి పండ్లు తింటున్న మీర్జా గాలిబ్‌గారిని చూడడానికి ఒక పెద్ద భూకామందు వచ్చాడు. మామూలు మనిషిలాగా మామిడి పండ్లను తింటున్న గాలిబ్‌ను చూచి ఎగతాళి చేయాలనిపించి ఆ భూకామందుకు: "అయ్యా! గాలిబ్ గారు! మా వైపు మామిడి పండ్లను గాడిదలు కూడా తినవు" అని అన్నాడు. గాలిబ్ తక్కువ తిన్నవాడు కాదు కదా! వెంటనే అందుకుని "అవునండి కామందుగారు మీరు చెప్పింది అక్షరాలా నిజం. గాడిదలు మామిడి పండ్లు తినవు" అన్నాడు. చిన్నబోవడం ఈసారి కామందు వంతైంది.

"ఎక్కడైతే అత్యున్నతమైన సత్యాలు ఆచరణీయాలుగా రూపొందుతాయో, సమాజం అత్యంత ఘనత గలది" — స్వామి వివేకానంద

# వంటింటి సలహాలు

## సీసాను బాగా కుదిలించండి

గాజు సీసాను శుభ్రపరచడం అతి సులువు. కాస్తంత నవాసారాన్ని నీటిలో కలిపి అందులో వేయండి. వేసిన తరువాత సీసాను బాగా కుదిలించండి. కాస్సేప యిన తరువాత ఆ నీటిని వంచేయండి. ఆ తరువాత సీసాను గోరువెచ్చని నీటితో తప్పక కడగండి.



## యుడికిలోన్ (EAU - De - cologne) రాయండి

యుడికిలోన్‌ను రాసి గుడ్డ లేదా సిల్కు పైనున్న జిడ్డును తొలగించవచ్చును. జిడ్డును తొలగించే మరో ఉత్తమ సాధనం కార్బన్ టెట్రాక్లోరైడ్. దీన్ని వాడేటప్పుడు కాస్తంత జాగ్రత్తగా వాడాలి. ఈ పదార్థ‹ వాసన చూడకండి.

## గుడ్డను మృదువుగా ఒత్తి తుడవండి

నల్లటి లేదా నేవీ బ్లూ గుడ్డను శుభ్ర‹ చేయడానికి చల్లారిన తేనీరును గాని బా‹ నీళ్ళు కలిపిన అమ్మోనియాను గా‹ వాడండి. గుడ్డను ఈ ద్రవంలో అ‹ మెత్తగా ఒత్తి తుడవండి. అలా తుడిచి‹ తరువాత ఆ గుడ్డను గాలి తగిలేల ఆరబెట్టండి.

## అతి విశాలమైన టెలి కమ్యూనికేషన్స్ ఉపగ్రహం

*అక్టోబరు నెల 28, 1989 న ప్రపంచ‹ లోని అతి విశాలమైన టెలీ కమ్యూనికేషన్స్ ఉపగ్రహం ఇన్‌టెల్‌సాట్ (Intelsat) VI ఆకాశ‹ కక్ష్యలో యూరోపియన్ అరిఅనె (Ariane) 44 - Lఅన్న రాకెట్ చేత ఉంచ బడింది. రెండు వైపుల ఏకకాలంలో ప్రసారం చేయగల 24,000 టెలిఫోన్ సర్క్యూట్లను, మూడు కలర్ టెలివి జన్ ఛానల్స్‌ల సౌకర్యాల గల ఉపగ్రహ‹ సహాయంతో టెలిఫోన్, టెలివిజన్, ఫాక్స్ టెలెక్స్, డాటాలను ప్రసారం చేయవచ్చును.*

"ఒక మంచి అబద్ధాల కోరుకు మంచి జ్ఞాపకశక్తి ఉండాలి."

— అరబిక్ సామెత

● ఇటీవల జనాభా గడియారం ముల్లు 88 కోట్ల జనాభాను మనం దాటాం అని సూచించింది.

● 1981 వ సంవత్సరంలో 221 మంది నివసిస్తున్న ప్రాంతంలో ఈ రోజు మరో 46 మంది అధికంగా కలసి నివసిస్తున్నారు.



● ప్రతి సంవత్సరం మన జనాభా 1.7 కోట్లు పెరుగుతూంది. జనాభా దృష్టితో చూస్తే ఈ పెరుగుదల ఒక ఆస్ట్రేలియా జనాభాకు సమానం.

● భూగోళపు విస్తీర్ణతలో కేవలం 2.4 శాతం విస్తీర్ణత మాత్రం కలిగిన భారతదేశంలో ప్రపంచ జనాభాలోని 16 శాతం జనం జీవిస్తున్నారు.

● తనజీవితకాలంలో ఒక భారతీయ స్త్రీ నాలుగుసార్లు గర్భం ధరిస్తుంది. అదే చైనాలోని స్త్రీ కేవలం రెండుసార్లు మాత్రం గర్భం ధరిస్తుంది.

—'స్వస్త్ హింద్' సౌజన్యంతో

## సంతోషం!

సంతోషం ఉత్సాహాన్ని కలిగిస్తుంది. కష్టాలు ఎలాంటి నిరాశను, నిరుత్సాహాన్ని కలిగించలేవు. కారణం ఆశవాటిని బలంగా ఎదుర్కొంటుంది. మనను సుఖకర స్వభావాలను ఎక్కువ చేసుకునే అవకాశాలను స్వంతం చేసుకుంటుంది. ఈ స్వభావం జయాన్ని సాధించి పెట్టడంలో అరుదుగా విఫలమవుతుంది.

— శామ్యూల్ స్మైల్స్

## ప్రపంచంలో బాల కార్మికులు

ప్రపంచంలోని మొత్తం పనివారిలో *6.2 శాతం లేదా 145 మిలియన్ పిల్లలు - వీరిలో 14 ఏళ్ళ లోపువారే అధికులు - ఒక సురక్షితమైన ఇల్లు కానీ పాఠశాల ఉపాధ్యాయుల మార్గదర్శకత్వం కానీ లేకుండా, వీటికి దూరంగా సొంతంగా సంపాదించుకుని జీవిస్తున్నట్లు ఒక అంచనా వేయబడింది*

"ఇతరులతో పోల్చుకోకుండా నీ జీవితాన్ని అనుభవించు."

# వీరిని గురించి తెలుసుకోండి

కనన్‌దేవి: అపరంజి కంఠం గల గాయని. స్వాతంత్ర్యానికి పూర్వం భారత చలన చిత్ర రంగంలో అత్యంత ప్రసిద్ధి పొందిన గాయక నటీమణి ఈమె. 1935లో "మన్‌మొయీ గరల్స్ స్కూల్" అనే బెంగాలీ చిత్రం విడుదల తరువాత ఈమె ప్రజాదరణకు పాత్రురాలయ్యారు. చలన చిత్రాలకు చేసిన విశిష్ట సేవలకు దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు పొందారు.

జంధ్యాల పాపయ్యశాస్త్రి (కరుణశ్రీ): ప్రఖ్యాత తెలుగు కవి, నాటకకర్త మరియు సాహితీ విమర్శకుడు. దాదాపు 40 ఏళ్ళ క్రితం ఆయన రచించిన "పుష్ప విలాపం" ప్రతి కుటుంబం పాడుకునే పద్యకృతిగా రూపొందింది.

యూల్ బ్రిన్నర్: విఖ్యాత హాలీవుడ్ నటుడు. "ది కింగ్ అండ్ ఐ" సంగీత చిత్రంలో కింగ్ ఆఫ్ సియాం పాత్ర ద్వారా అతనికి ఆస్కార్ పురస్కారం లభించింది. "అనస్టాసియా," "బ్రదర్స్ కరమజోవ్," బైబిల్ ఇతిహాసం "సోలోమన్ అండ్ షీబా," "ది టెన్ కమాండ్‌మెంట్స్" మరియు "ది మాగ్నిఫిషియెంట్ సెవెన్" వంటి అనేక మరువరాని చిత్రాలలో నటించారు.

ఫిరోజ్ షా మెహతా (1845-1915): బొంబాయికి చెందిన ఒక పార్శీ కుటుంబంలో జన్మించి, ఇంగ్లండ్‌లో న్యాయ శాస్త్రం అభ్యసించిన తరువాత విజయవంతంగా వృత్తి నిర్వహణ చేశారు. ఒక సభ్యుడుగా బొంబాయి శాసన మండలి మరియు ఇంపీరియల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా కార్యకలాపాలలో పెత్తనం చెలాయించారు. బొంబాయి విశ్వవిద్యాలయం ఫెలోగా ఉన్నత విద్యలో చురుకైన శ్రద్ధ ప్రదర్శించారు. 1913లో ఆయన సుప్రసిద్ధమైన "బాంబే క్రానికల్" (ఆంగ్ల దినపత్రిక) స్థాపించారు.

రామతీర్థ (1873-1906): మురారివాలా (పంజాబ్) నుంచి స్వాగతించబడిన రామతీర్థ ఉజ్జ్వలమైన విద్యావిషయిక జీవిత గమనం కలవ్యక్తి. 1901లో ఆయన ఒక సన్యాసిగా మారిపోయారు. అచిర కాలంలోనే గొప్ప వేదాంత ప్రబోధకుడుగా రూపొందారు. జపాన్ మరియు అమెరికాలలో ఆయన వేదాంతోపన్యాసాలు చేసి ప్రజల నుండి ప్రశంసలు పొందారు. మానవాళిని సామూహికంగా బంధ విముక్తి చేయటమే ఆయన ప్రచార లక్ష్యం.

ట్రెవర్ హొవార్డ్: సుప్రసిద్ధ బ్రిటిష్ నటులలో ఒకరు. "మ్యూటినీ ఆన్ ది బౌంటీ," "ది థర్డ్‌మాన్," "సన్స్ అండ్ లవర్స్," "వాన్ రయన్స్ ఎక్స్‌ప్రెస్" మరియు "ది చార్జ్ ఆఫ్ ది లైట్ బ్రిగేడ్" — అతని ప్రఖ్యాత చిత్రాలలో కొన్ని.

..క కళ చేతిలో ఉన్న వ్యక్తి, అంతటా ఒక భాగం కలిగి ఉంటాడు."

కొన్ని వందల సంవత్సరాల క్రిందట... అనగనగా ఒక రాజు. ఆ రాజుకు వేటంటే మహా సరదా. వేటకు బయలుదేరే ముందు వాతావరణం గురించి తెలుసుకుని బయలుదేరటం ఆయన అలవాటు. వాన వస్తుందా, రాదా అని ఆయన మంత్రి గారిని ప్రశ్నించేవాడు. ఆయన ఆలోచించి వస్తుందనో, రాదనో చెప్పేవాడు.

ఒక రోజు రాజు అలవాటు ప్రకారం వేటకు బయలుదేరాడు. ఆనవాయితీ ప్రకారం మంత్రిని వాన విషయంగా సంప్రదించాడు. మంత్రిగారు ఆలోచించి వాన వచ్చే అవకాశం లేదని గట్టిగా చెప్పాడు. ఈసారి వేటకు వెళుతున్నప్పుడు రాజుగారు మంత్రిగారిని కూడా వెంట బెట్టుకుని బయలుదేరాడు. మధ్యదారిలో ఒక పల్లెటూరివాణ్ణి రాజుగారు చూసారు. ఆ గ్రామీణుడు గాడిదతో సహా ఆయనకు ఎదురొచ్చాడు. రాజుగారిని దాటిపోతూ ఆ పల్లెటూరివాడు ''అయ్యా ఇక కాస్సేపటిలో చాలా పెద్ద వర్షం రాబోతుంది'' అని చెప్పి ముందుకు సాగిపోయాడు. ఆ పల్లెటూరివాడు చెప్పినట్లే కుండపోతగా వాన కురిసింది. రాజు, మంత్రిగారు తడిసి ముద్ద అయ్యారు. వేట అర్థాంతరంలోనే ఆగిపోయింది. రాజు అగ్గిగుగ్గిలమై సరైన సూచనను ఇవ్వలేని మంత్రిపై విరుచుక పడ్డారు.

రాజుగారు తన రాజ్యానికి తిరిగొచ్చారు. వచ్చిన వెంటనే ఆ గ్రామీణుడిని తన దర్శనం కోసం రమ్మని కబురుపెట్టారు. తన ముందు వినయంతో, భయంతో చేతులు కట్టుకుని నించున్న ఆ పల్లెటూరి వాణ్ణి చూసి ''వాన వస్తుందన్న సంగతి నీకు ముందుగా ఎలా తెలిసింది'' అని ప్రశ్నించాడు. ఆ పల్లెటూరివాడు వినయంగా ''మహారాజా నాకు జరగబోయే విషయాలను ముందే చెప్పేంత తెలివి తేటలు లేవు. కాని వాన రాబోయే ముందు నా గాడిద చెవులు నిక్కబొడుచుకుంటాయని అనుభవంతో తెలుసుకున్నాను'' అని నింపాదిగా జవాబిచ్చాడు.

## తొండంలో రెండు గ్యాలెన్ల నీరు



ఏనుగు తొండంలో రెండు గ్యాలెన్ల నీరు అవలీలగా పట్టగలదు.

**''నీ పొరుగు వానితో తగవులాడటం కంటే నీ తల్లితో పోట్లాడటం మేలు.''**

**— అరబిక్ సూక్తి**

# నీల్స్ బోర్

రెక్స్ కేటింగ్

నీల్స్ బోర్ ప్రపంచ శాస్త్రజ్ఞులలో అగ్రగణ్యుడు. అతని శాస్త్ర పరిశోధనల కారణంగా ప్రపంచ శాస్త్రజ్ఞులు అతన్ని గౌరవించారు.




నీల్స్ బోర్ క్రీ.శ. 1885 సంవత్సరంలో డెన్మార్క్‌లో జన్మించారు. ఇతను మేథావుల కుటుంబానికి చెందిన వ్యక్తి. ఇతని తండ్రి కోపెన్‌హాగన్ విశ్వవిద్యాలయంలో మనస్తత్వ శాస్త్ర ఆచార్యుడిగా పనిచేసేవారు. ఇతని సోదరుడు హరాల్డ్ ఒక విశిష్ట గణిత శాస్త్రజ్ఞుడుగా గణుతి కెక్కిన వ్యక్తి. 20 సంవత్సరాల వయసులోనే నీల్స్ బోర్‌కు రాయల్ డేనిష్ అకాడమీ ఆఫ్ సైన్స్ వారు బంగారు పతకాన్ని ఇచ్చి గౌరవించారు.

శాస్త్రజ్ఞుడు బోర్ మంచి క్రీడాకారుడు కూడా. కాలు బంతి ఆట ఇతనికి ప్రియమైన ఆట. డానిష్ జాతీయ ఫుట్‌బాల్ బృందంలో రిజర్వు గోల్‌కీపరుగా ఉండేవారు.

ఎలక్ట్రాన్ థియరీ ఆఫ్ మెటల్స్ అన్న విషయంపై చేసిన అధ్యయనానికి బోర్‌కు మొదట ఎం.ఏ. పట్టా, ఆ తరువాత పిహెచ్.డి. లభించింది. 1912 వ సంవత్సరంలో బోర్ భౌతిక శాస్త్రజ్ఞుడు ఎర్నెస్ట్ రూథర్‌ఫోర్డును బ్రిటన్‌లో కలుసుకున్నాడు. అప్పటికే రూథర్‌ఫోర్డుకు అణుశక్తి పరమైన మూల బిందువును (Atomic necleus) కనిపెట్టిన వ్యక్తి అన్న పేరుండేది. వెంటనే ఇద్దరి మనసులు కలిసాయి. రెండు సంవత్సరాల కాలం 1914 నుండి 1916 వరకు బోర్ రూథర్‌ఫోర్డుకు

## ఆస్ట్రేలియాను జయించిన ఇంగ్లండ్

*1951 జూన్ 30 న సిడ్నీ (ఆస్ట్రేలియా)లో అంతర్జాతీయ ఫుట్‌బాల్ పోటీలలో అత్యధిక గోల్స్ తేడా నమోదయింది. ఇంగ్లండ్ 17-0 తో ఆస్ట్రేలియాను ఓడించింది.*

"ఒక దేశం తయారు చేసే నాయకుల్ని బట్టి ఆ దేశం గుర్తింపు పొందుతుంది."

సహాయకుడిగా పనిచేశారు.

1916 లో బోర్ మాన్‌ఛెస్టర్ వదలి డెన్మార్క్ వెనుతిరిగారు. కోపెన్‌హాగన్ విశ్వవిద్యాలయంలో ఇతనికని ప్రత్యేకంగా ఒక స్థానాన్ని థియెరిటికల్ ఫిజిక్స్ ఛేర్ - కల్పించి గౌరవించారు. వెంటనే థియెరిటికల్ ఫిజిక్స్‌కు సంబంధించిన ఒక కొత్త విశ్వ విద్యాలయ స్థాపనకు ప్రణాళికను తయారు చేశారు. బోర్ కలల ఫలితమే ఈనాటి బోర్ సంస్థ (ఇన్‌స్టిట్యూట్). ఈ సంస్థ 1921 లో ప్రారంభమైంది. వెంటనే ఇది ఒక ప్రతిష్ఠాత్మక సంస్థగా గుర్తింపు పొందింది. భౌతిక శాస్త్ర ప్రపంచపు మేధావులను ఈ సంస్థ ఆకర్షించసాగింది. నాజీలు అధికారంలోకి రాగానే విడిచిపోతున్న జర్మన్ విశ్వవిద్యాలయ ఆచార్యులకు, పరిశోధకులకు బోర్ ప్రోద్బలంపై ఈ సంస్థ ఆశ్రయమిచ్చింది.

తన సంస్థలో నీల్స్ బోర్ జర్మనీకు చెందిన యువ శాస్త్రజ్ఞుడు హైసన్‌బర్గ్ (HEISENBERG) తో కలిసి సన్నిహితునిగా పనిచేశారు. మేధావి హైసన్‌బర్గ్‌ను ప్రపంచం ఈ రోజు క్వాంటమ్ మెకానిక్స్ జనకుడిగా గుర్తిస్తున్నది.

హైసన్‌బర్గ్ ఎలక్ట్రాన్లు గుంపులుగా ముందుకు సాగుతాయని (Quantum Jumps) అప్పటికే నిరూపించిన వ్యక్తి. ష్రోడింగర్ (Schroedinger) అన్న మరో శాస్త్రజ్ఞుడు సందేహానికి ఎలాంటి తావు లేకుండా కణాలు (Particles) నిరాఘాటంగా ముందుకు సాగిపోయే గుణాల్ని కలిగి ఉంటాయని, ఇవి అలల రూపంలో ఉంటాయని నిరూపించారు. రెండు సిద్ధాంతాలూ చాలా బలమైన ప్రాతి పదికలున్నవే. కాని ఒక దానితో ఇంకొక దానికి పొత్తు మాత్రం కుదరలేకపోయింది. నీల్స్ బోర్ రెండు సిద్ధాంతాలను స్వీక రించాలని, ఒకటి ఇంకొక దాన్ని పూర్తి చేస్తుందన్న వాదాన్ని ప్రతిపాదించారు. ఆ విధంగా జగత్ప్రసిద్ధి గాంచిన "కాంప్లి మెంటారిటి" సూత్రం ఆవిర్భవించింది. క్వాంటమ్ మెకానిక్స్ వరకు ఈ సంపూర్తి సూత్రం గొప్ప వరం.

ఈ సూత్రం ఆధారంగానే పలు

## గోథే తెలివితేటలు




*ఒక సాధారణ, తెలివితేటల భాగలబ్ధం (ఐ.క్యూ) 85 నుండి 115 మేరకు ఉంటుంది. జర్మన్ నవలారచయిత జోహాన్ ఉల్ఫ్‌గాంగ్ వాన్ గోథే ఐ.క్యూ. 185 గా ఉన్నది.*

"ఒక సబ్బు కడ్డీ మాదిరిగా దురదృష్టం కొంత పెద్దదిగా మొదలవు తుంది, కానీ చిన్నదిగానే మారిపోతుంది.' — అరబిక్ సూక్తి

సిద్ధాంతాలు ఉద్భవించాయి. ట్రాన్స్‌సిస్టర్, కంప్యూటర్, లేసర్, జెనటిక్ మానుపలేషన్, అణుబాంబు ఇత్యాది గణనీయమైన విజ్ఞాన పరమైన సాధనాలు ఈ సూత్రా నికి కొన్ని మచ్చుతునకలు.

Niels Bohr Institute



19 వ శతాబ్దపు మూడవ దశకం చివరి సంవత్సరాలలో నీల్స్ బోర్ పేరు ప్రతిష్ఠలు హిమాలయ శిఖరాల్ని చేరుకున్నాయి. అణు భౌతికశాస్త్ర నిపుణుడుగా యావత్ ప్రపంచంలో బోర్‌కు పేరుప్రతిష్ఠలు లభించాయి. ఈ శతాబ్దపు మూడవ దశకం చివరి సంవత్సరాల్లో అణు భౌతిక శాస్త్రం శిఖరాగ్రాన్ని చేరింది. 1943 లో సరైన సమయంలో స్వీడెన్ గుండా బోర్ పారిపోయి బ్రిటన్ చేరుకున్నారు. ఉత్తర సముద్రం (North Sea) మీదుగా మస్కిటో విమానంలోని బాంబుల అరలో దాక్కొని బ్రిటన్ చేరవలసిన ఆగత్యం అతనికొచ్చింది.

యునైటెడ్ కింగ్‌డమ్‌లో బ్రిటిష్ శాస్త్రజ్ఞులతో కలిసి బోర్ అణు బాంబు ప్రాజెక్టుపై పనిచేయసాగారు. ఈ శాస్త్రజ్ఞులు అమెరికాలోని లాస్ అలామాస్ (Los Alamos) కు మారినప్పుడు బోర్ కూడా వారిని అనుసరించాడు. అణు అస్త్రాలపై అదుపు సంబంధమైన ఒప్పందంపై అందర్నీ ఒక త్రాటిపై చేర్చేందుకు బోర్ 1944లో విశ్వ ప్రయత్నం చేసి విఫలుడయ్యారు.

1957 లో అప్పటి అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ సమక్షంలో బోర్ "శాంతికి పరమాణువు" (Atoms for peace) బహుమతిని అందుకున్నారు. ఈ బహుమతిని అందుకున్న మొట్టమొదటి వ్యక్తి నీల్స్ బోర్. 'హై ఎనర్జీ ఫిజిక్స్' (అత్యధిక శక్తి ఫిజిక్స్) యూరోపియన్ కేంద్రాన్ని నెలకొల్పాలన్న ప్రతిపాదనను బలపరచిన వ్యక్తి బోర్. 1962 లో నీల్స్ బోర్ కన్ను మూశారు.

— 'యునెస్కో ఫీచర్స్' సౌజన్యంతో

## మానసిక స్వభావమే వయసు

మనసు యొక్క స్వభావమే - వయస్సు
నీ స్వప్నాలను వెనుకకు మళ్ళించినా
నీ విశ్వాసం చల్లబడి పోయినా
నీవు ముందుకు ఎంతమాత్రం
చూడలేక పోయినా,
నీ అభ్యుదయేచ్ఛ నమసిపోయినా
అప్పుడు, నీకు వృద్ధాప్యం వచ్చినట్లే....

"ఒకవిద్య - నింపవలసిన కుండీ కాదు, కానీ వెలిగించవలసిన జ్వాల

## టాటా స్టీలుకు మేనేజ్‌మెంట్ సైన్స్ బహుమతి

ఫ్రాంజ్ ఈడెల్‌మెన్ వారి 'మేనేజ్‌మెంట్ సైన్స్ అఛీవ్‌మెంట్' 23 వ సంవత్సరపు బహుమతిని ఈసారి టాటాస్టీల్ గెలుచుకుంది. అమెరికాలోని బోస్టన్‌లో ఉన్న ఈ సంస్థ అందజేసిన బహుమతిని గెలుచుకున్న ప్రపంచంలోని ఏకైక ఉక్కు కర్మాగారం ఇదే. ఇది ప్రపంచంలోని ఈ కోవకు చెందిన అంతర్జాతీయ బహుమతులలో అత్యున్నతమైనది.

## 1993వ సంవత్సరపు దాదాసాహెబ్ ఫాల్కే బహుమతి

భారతదేశపు సినిమా పాటల రచయితల్లో భీష్మాచార్యుడిగా పరిగణింపబడే సుప్రసిద్ధ ఉర్దూకవి శ్రీ మజ్రూహ్ సుల్తాన్‌పురి 1993వ సంవత్సరపు

సినిమా పరిశ్రమకు వారుచేసిన సేవలను పురస్కరించుకుని వారికి ఈ ప్రతిష్ఠాత్మక బహుమతి ఇవ్వబడింది.

## భవన నిర్మాణ కళానిపుణ బహుమతిని గెలుచుకున్న ప్రప్రథమ భారతీయుడు

భారతదేశపు సుప్రసిద్ధ భవన నిర్మాణ కళానిపుణుడు శ్రీ ఛార్లెస్ కోర్రియా (Charles correa) ప్రపంచపు అతిపెద్ద 'భవన నిర్మాణ కళానిపుణ' బహుమతిని గెలుచుకున్న తొలి భారతీయుడు. జపాన్ ఆర్ట్ అసోసియేషన్ వారు ఈ ప్రీమియం ఇంపీరియల్ ఆర్కిటెక్చర్ అవార్డు ప్రదాతలు.

## భగవద్గీత మొట్టమొదటి ఇంగ్లీషు అనువాదం



భగవద్గీత ప్రాశస్త్యాన్ని యూరప్‌వాసులు ఆంగ్ల అనువాదం ద్వారా తెలుసుకున్నారు. ఆ అనువాదాన్ని సర్ ఛార్లెస్ విల్‌కిన్స్‌గారు చేశారు. వారు సంస్కృతాన్ని వారణాసిలో అభ్యసించారు. *1785లో* వారు భగవద్గీతను ఆంగ్లంలోకి అనువదించారు. ఈ ఆంగ్ల అనువాదానికి మొట్టమొదటి భారత గవర్నర్ జనరల్ వారన్ హేస్టింగ్స్ పీఠిక వ్రాశారు.

"మనోభావాలు, చేతల ద్వారా మనం చూపించుకుంటున్నదే - మన జీవితం."

కోపం అన్నది మనందరితో వచ్చిన పెద్ద చిక్కు. బయటి సమస్యలు వస్తుంటాయి, పోతుంటాయి. అవి తాత్కాలికాలే. కానీ కోపం అన్నది మన ఆంతరంగిక సమస్య. జీవితాంతం ఈ సమస్య మనల్ని వెంటాడుతూనే ఉంటుంది.



కోపం అన్నది ఒక గంభీర సమస్య. ఇది విపరీత పరిస్థితులకు దారి తీస్తుంది. కోప్పడే వ్యక్తి, కోపానికి గురయ్యే వ్యక్తి ఇద్దర్నీ ఇది బాధిస్తుంది. ఈ బాధ చాలాకాలం హృదయాంత రాళాలలో ఉండిపోతుంది కోపం కారణంగా మనం ఎటూ కదలలేని స్థితిలో ఉండిపోతుంటాం. అంతేకాకుండా చాలాకాలం పనిచేయడం కష్టమవుతుంది.

స్నేహబంధాలను పెంచుకోవడానికి చాలాకాలం పడుతుంది. కానీ కోపం కారణంగా ఈ బంధం ఒక తృటిలో తెగిపోతుంది ఒకసారి తెగిన స్నేహసూత్రాలను ముడివేయడం కష్టం. బంధాల్ని పటిష్టం చేయడం బ్రహ్మతరం కూడా కాదు.

కోపం వచ్చినప్పుడు తర తమ భేదాన్ని పాటించకుండా, ఆలోచించకుండా మాట్లాడటం జరుగుతుంది. కోపం శాంత వాతావరణాన్ని భంగపరుస్తుంది. ఇంతటితో ఆగక ఆధ్యాత్మిక

## నగరానికి 55 మీటర్ల అడుగున కట్టబడిన వివిధ విభాగాలున్న కట్టడం

*చైనా రాజధాని నగరం బీజింగ్‌లో ఒక అద్భుతమైన భూగృహ కట్టడం ఉంది. ఈ భూగృహ కట్టడంలో 420 హోటళ్ళు ఉన్నాయి. ఈ హోటళ్ళలో 30,000 మించిన పడక లున్నాయి. ఇవి కాక గిడ్డంగులు, సమావేశాలకు అనుకూలమైన గదులు, సినిమా హాళ్ళు క్రీడా భవనాలు, రోలర్ స్కేటింగ్ రింక్, అగ్నిమాపక దళ కేంద్రం, ఒక ఆసుపత్రి, జ్ఞాపికలను అమ్మే 40 ప్రత్యేకమైన దుకాణాలు కూడా ఈ విడివిడి భాగాలున్న కట్టడంలో ఉన్నాయి. మూడు దశలుగా 55 మీటర్లు క్రిందికి ఉంటుంది.*

"అనేకమంది తమ జ్ఞాపకశక్తి గురించి ఫిర్యాదు చేస్తుంటారు, కొద్దిమంది మాత్రమే తమతీర్పు గురించి ఫిర్యాదు చేస్తారు."

అభివృద్ధికి కూడా ఇది అవరోధంగా మారగలదు. ఈ సమస్యకు ఒకే ఒక పరిష్కారం ఉంది. మన బలహీనతను మనం బహిరంగంగా ఒప్పుకోవాలి. కోపం మన మానసిక దౌర్బల్యానికి చిహ్నం.

సాధారణంగా మనం మనకోపాన్ని సమర్థించుకుంటాము. ఇది చాలా దురదృష్టకరమైన విషయం. ఇతరుల ప్రవర్తన, చికాకు కలిగించే స్వభావం మనకోపానికి కారణంగా భావిస్తాము. ఆకారణంగా మన తప్పులకు వారిని బాధ్యులను చేస్తుంటాము మన ఆదరణను సమర్థించుకుని మనల్ని మనం సరిచేసుకునే ద్వారాన్ని తద్వారా బలంగా మూసివేసు కుంటున్నాము. మన బలహీనతల్ని మనం ఒప్పుకున్న పక్షంలో క్రమంగా మన మానసిక శక్తి అభివృద్ధి పొందుతుంది. అప్పుడు 'ఇది నా బలహీనత. ఈ బలహీనతకు నేను గురికాను' అని పదే పదే అనుకోవడంతో ఈ బలహీనతకు పరిష్కారం లభిస్తుంది. 'నేను ఎటువంటి పరిస్థితినైనా ఎదుర్కోగలను. నన్ను ఇతరుల కోపతాపాలు, చిరాకు స్వభావం ఏ మాత్రం బాధపెట్టలేవు' అని ఆలోచించటం మనం నేర్చుకోవాలి.

ఇతరుల ప్రేరేపణ కారణంగా సృష్టించబడిన ఉద్రిక్త వాతావరణానికి ఎప్పుడూ ఎరకాకండి. ఇతరుల ప్రవర్తన మీ ఆధీనంలో ఉండదు. కాని మీరు శాంతమూర్తులుగా మాత్రం ఉండగలరు కదా!

## మీ విజ్ఞానం పరీక్షించుకోండి

### జవాబులు

**క్విజ్:** 1. (బి) పాటలీపుత్ర, 2. (డి) నేషనల్ హెరాల్డ్, 3. (డి) విపరీతంగా పెరుగుతున్న జనాభా, 4. (బి) వేపుడు, 5. (సి) బచ్చలికూర, 6. (డి) భారీ ఎలక్ట్రికల్స్ పరిశ్రమ, 7. (డి) రచయితకు, 8. (ఎ) 35 సంవత్సరాలకు పైబడిన వయసు.

**మాటల మహిమ:** 1. (బి) చిన్న కత్తి, 2. (బి) నేయుట, 3. (ఎ) కలువ. 4. (ఎ) స్త్రీ, 5. (ఎ) మేలు, 6. (డి) తిండిపోతు, 7. (డి) చిన్న ఫిరంగి, 8. (డి) మెఱుపు.

**తెలివికి పరీక్ష:** 1. శ్రీ అటల్ బిహారీ వాజ్‌పాయ్‌గారికి ఉత్తమ పార్లమెంటు సభ్యునిగా గుర్తించి బహుమతి నిచ్చారు 2. కుట్రాలీశ్వరన్ - 11 గంటల, 36 నిమిషాలు, 3. 32, 64, 4. తాత, తండ్రి, మనమడు, 5. పదింతలు 10 పైసలు కలిస్తే ఒక రూపాయి అవుతుంది. కానీ 10x10 గుణితం ప్రకారం కాదు, 6 దుమ్ము అసలు పేరుకోదు.

## ప్రపంచంలో మేలైన కంబళి

*ప్రపంచంలో అందమైన, మేలైన కంబళి కపూర్ కుటుంబం చేతితో అల్లిన ఒక జైపూ సిల్క్ కంబళి. ఇంతకు క్రితం ఒక మేలై కంబళిని టర్కీ (దక్షిణ యూరప్) తయా చేసినట్లు నమోదయింది.*

# ఎలా?

## కొన్ని జంతువులు రాత్రులలో ఎందుకు తిరుగుతాయి?

కొన్ని వేటాడబడే పక్షులు పగలు తిరుగుతుంటాయి. సింహం, పులి, చిరుత లాంటి కొన్ని మృగాలు రాత్రి మేల్కొని పగలు నిద్రిస్తాయి. తాము భుక్తికై వేటాడే జంతువులను సులభంగా వేటాడేందుకు ఈ మృగాలు రాత్రిళ్ళు సంచరిస్తుంటాయి.



మనిషి కంటే చీకటిలో బాగా చూడగలిగిన శక్తి ఈ మృగాల కళ్ళకు ఉంది. రాత్రిళ్ళు తిరగడంలో ఈ జంతువులకు ఒక సౌకర్యం కూడా ఉంది. తాము వేటాడబోయే జంతువులకు ఇవి కనబడవు. ఈ క్రూర మృగాల కున్నంతటి కంటి చూపు వేటాడబడే జంతువులకు ఉండదు. పగలు వేటాడడం సింహం, పులిలాంటి జంతువులకు కొంచెం కష్టం. వేటాడబడే జంతువులు క్రూరమృగాల కంటే కూడా వేగంగా పరుగు తీయగలవు. జంతువుల కనుచూపు క్ర్రూరమృగాల కనుచూపు కంటే కూడ చాలా స్పష్టంగా ఉంటుంది.

## ఉపనిషత్తులనగా ...

*భారతీయ వేదాంత సారాన్ని ఉపనిషత్తు లంటారు. జీవితానికి చెందిన చర్చలను సంభాషణల రూపంలో ఇందులో పొందుపరిచారు. దివ్యజ్ఞాన సంభూతుడైన గురువు, ఆదర్శ వంతుడూ, సద్గుణశీలుడైన శిష్యుడి మధ్య ఈ సంభాషణలు జరిగాయి. సత్యం, భగవంతుడు లేదా గురువును మనిషికి దగ్గరగా తీసుకు రావడం అన్నదే ఉపనిషత్తు అన్న మాటకు వాస్తవిక అర్థం.*

## టెస్ట్ మ్యాచ్ చరిత్రలో మొట్టమొదటి హాట్రిక్

*ఆస్ట్రేలియాకు చెందిన శ్రీ ఎఫ్.ఆర్.స్పొఫోర్త్ (Spofforth)కు మొట్టమొదటి హాట్రిక్ (వరుసగా మూడు వికెట్లను పడగొట్టడం) సాధించిన ఘనత దక్కుతుంది. ఆస్ట్రేలియా - ఇంగ్లండు జట్లకు మధ్య 1879లో జరిగిన టెస్ట్ మ్యాచ్‌లో ఈ సంఘటన జరిగింది.*

''ఒక ఆశ్రమానికి వెళ్ళి, చెట్టుక్రింద కూర్చుని, ధ్యానం చేసే కోరిక నాకు లేదు. పనిచేసేందుకు తప్ప మరి దేనికీ నేను పనికిరాను.''

— జె.ఆర్.డి. టాటా

డా. క్లైవ్ డి. హర్లీ

కొత్త అనుభవాలు మనకు అవసరమైన ప్రాథమిక, మానసిక సాధనాలను సరఫరా చేస్తాయి. జీవితంలో స్థిరత, ఎంత త్వరగా చోటు చేసుకుంటుందో మార్పుకు అవసరం కూడా అంతే త్వరగా ఏర్పడుతుంది.



జీవితం పట్ల మీకున్న అభిరుచి తగ్గుతున్నట్లు మీరు భావిస్తే దాని అర్థం బహుశ మీరు ఈ కోరికల వైపు తగినంత దృష్టిని ప్రసరింప చేయలేదనే.

మీ జీవితంలో కొత్త అభిరుచులు, కొత్త అభిలాషలు మొలకెత్తాలంటే ఈ క్రింద కనబరచిన సలహాలను సాధ్యమైనంత త్వరలో పాటించండి.

1. కొత్త పనులను చేపట్టండి: కొత్త అభిరుచిని, కొత్త అభిలాషను, కొత్త ఆటను చేబట్టి జీవించేందుకు కావల్సిన ఉత్సాహాన్ని మీలో మరోసారి ప్రజ్వలింప జేసుకోండి. గతంలో మీకు బాగా నచ్చిన పని, చేయాలనుకుని చేయలేని పని అది ఏదైనా ఉంటే ఆ పనిని మీరు వెంటనే ప్రారంభించండి. ఆ పనిని ప్రారంభించడానికి ప్రస్తుతం మీ వద్ద కావల్సినంత ఉత్సాహం తక్కువైనా ఫరవాలేదు. మీరు మాత్రం ఆ పనిని వెంటనే చేపట్టండి.

ఒక కొత్త పనిని చేపట్టడం వల్ల మీరు నష్టపోయేదేమీలేదు. మీకు లాభమే కలుగుతుంది. మీకు విసుగు, దుఃఖం నుండి విముక్తి లభిస్తుంది. కొత్త పని కారణంగా మీ జీవితంలో కొత్త వెలుగు ప్రవేశిస్తుంది. మీ జీవితం ఉల్లాసమయ మవుతుంది.

## సార తానికి నో

*సారస్వతానికి (సాహిత్యానికి) పిన్న వయస్సులో నోబెల్ బహుమతి పొందిన రుడ్‌యార్డ్ కిప్లింగ్. 1907 లో తన 41వ ఏట అతడు ఈ బహుమతి పొందాడు. ఆంగ్ల కథా రచయిత, నవలాకర్త, కవి మరియు సామ్రాజ్యవాది అయిన కిప్లింగ్ అత్యంత పేదవాడు.*

"తాము చేస్తున్నది ప్రతివాడికీ తెలుసునని [illegible] అధిక ప్రజలు నిశ్శబ్దంగా బాధపడడానికి [illegible]."

మీ జీవితంలో సుఖశాంతుల సన్నాయి మృదుమధురంగా మ్రోగుతుంది.

కొత్త కార్యరంగంలో ప్రవేశం అంటే అది మార్పుకు మార్గం అన్న సంగతి గుర్తుంచుకోండి. కొత్త ఆలోచనలు, కొత్త పుస్తకాలు,



కొత్త మనుషులు, కొత్త నైపుణ్యాన్ని పెంచుకోవడం, కొత్త కండరాలను వాడడం, మీ డబ్బులు ఖర్చు చేయడానికి కొత్త వస్తువులను ఎన్నుకోవడం ఇలా ఎన్నో విషయాలు మార్పుకు అవకాశం కలిగిస్తాయి. ఇంకా మార్పును వివరించాలంటే బహిర్ముఖుడు కావడం అనీ, ఇంతకుముందు చేస్తున్న పనుల నుండి దూరం కావడం అనీ, బాధలు, నొప్పులు, సమస్యలు ఒంటరితనం నుండి విముక్తిని పొందడం అనీ, చెప్పాలి.

2. కొత్త విషయాలను నేర్చుకోండి: మనకు ఏమాత్రం తెలియని పనులు, రుచి చూడని అనుభవాలు, తెలుసుకోవలసిన సంగతులు ఎన్నో ఉన్నాయి. ఆ విషయాల పట్ల అభిరుచిని పెంచుకుని మనం మన జీవితాన్ని సుఖమయం చేసుకోగలం. అన్ని విషయాలు కాకపోయినా ఏదో ఒక విషయంపై దృష్టిని మళ్ళించడం అన్నది ఒక మంచి ప్రణాళిక. మన తీరిక వేళలను ఈ ప్రణాళికను అమలు పరిచేందుకు కేటాయించవచ్చును.

ఉదాహరణకు శాస్త్రీయ సంగీతం వైపు మీరు మీ దృష్టిని ఇంతవరకు మళ్ళించలేదనుకోండి. ఇప్పుడు మళ్ళించండి. మీ సుఖమయ జీవితానికి బంగారు బాటను మీరే వేసుకోండి. కొత్త స్వర సమ్మేళనాల్లో పాల్గొనండి.

మీరు నేర్చిన విద్యలలో ఒక వాద్యాన్ని వాయించడం అన్నది లేనిపక్షంలో వెంటనే నేర్చుకోవడం ప్రారంభించండి.

ఈ కళ మీకు నచ్చలేదంటే దీన్ని వదిలేయండి. మీ దృష్టిని ఆకాశం వైపో లేదా మనం నివసిస్తున్న భూమివైపు మరలించండి.

ఖగోళజ్ఞానం లేదా భూగోళం జ్ఞానం మీలో అంతులేని ఆసక్తిని పెంచగలదు. ఇదీ నచ్చకపోతే సముద్ర తీర ప్రాంతాలలో దొరికే గవ్వలను సేకరించండి. లేదా తపాలా బిళ్ళల సేకరణను ప్రారంభించండి. ఇలా చెప్పుకుంటూ పోతే అభిరుచిని పెంచుకునే మార్గాలు మీకు ఎన్నో తారసపడతాయి.

3. కొత్త ప్రదేశాలను సందర్శించండి మనిషికి మార్పు, కొత్త వాతావరణం అవసరం ఎంతైనా ఉంది. మొట్టమొదట

"గొప్ప వ్యక్తుల అనుభవాలు సాధారణ వ్యక్తులకు ఉదాహరణలు."

సారి పోయి చూచినప్పుడు ఒక ప్రాంతంలోని లేదా నగరంలోని అన్ని విషయాలను తెలుసుకోలేము. కొన్ని రహస్యాలు రహస్యాలుగానే ఉండిపోతాయి. అలాంటి ప్రాంతాన్ని, నగరాన్ని మరోసారి దర్శించండి.

వారాంతం చూచిన ప్రాంతాన్నే మరీ మరీ చూడాలా అని మిమ్మల్ని మీరే ప్రశ్నించుకోండి. ప్రతి సంవత్సరం వెళ్ళే చోటుకే మళ్ళీ మళ్ళీ వెళ్ళాలా? ఆలోచించండి. ఇంతవరకు మీరు చూడని ప్రాంతానికో, లేదా మీకు పరిచయం లేని కొత్త జిల్లాకో ఏరెందుకు ఈసారి ప్రయాణం కాకూడదు!

మ్యూజియంకో, కళామందిరానికో, లేక వస్తుప్రదర్శనశాలకో వెళ్ళి ఎన్ని రోజులైందో ఒకసారి గుర్తుకు తెచ్చుకోండి. అప్పుడు మీరు పొందిన అనుభవాలను ఒకసారి నెమరువేసుకోండి! అప్పుడు ఆ ప్రయాణం ఎంత ఉల్లాసాన్ని, ఎంత స్ఫూర్తి నిచ్చిందో మీకు తెలుస్తుంది. తప్పక మీరు ఎన్నో కొత్త విషయాలను నేర్చుకుని ఉంటారు. మీ జ్ఞాన విస్తరణ తప్పక జరిగి ఉంటుంది. అటువంటి స్థలాలను మరోసారి దర్శించేందుకు ప్రణాళికను వేసుకోండి.

4. క్రొత్త దృక్పథాలను అలవాటు చేసుకోండి: ఇద్దరు దొంగలు జైలు ఊచల నుండి బయట ప్రపంచాన్ని చూడసాగారు. ఇద్దరిలో ఒకడు బయటి బురదను చూస్తే రెండవ వాడు నక్షత్రాలను చూడసాగాడు. విద్యుక్త ధర్మ నిర్వహణ కారణంగానో లేదా బరువు బాధ్యతల కారణంగానో మనం సులభంగా దుఃఖాలకు, తప్పులకు, పొరబాట్లకు గురి అవుతుంటాము. అటువంటప్పుడు ఒక కొత్త పని వైపు లేదా ఒక కొత్త అభిరుచి వైపు మీరు మీ మనస్సును మళ్ళించండి. ఈ మార్పు మీకు సుఖశాంతులను ప్రసాదిస్తుంది.

చివరగా ఒక మాట! మన నిజంగా మనది కాదు. అది ఇతరులది. ఇతరుల పట్ల, ముఖ్యంగా మీ సంపర్కంలో వున్న వారిపట్ల మీకు కొన్ని ఖచ్చితమైన అభిప్రాయాలుంటాయి. వీటిని కొంత మార్చుకునేందుకు ప్రయత్నించండి. మంచి చెడునుండి మంచిని మాత్రం ఎన్నుకోండి. ఎదుటవారిని, వారి బలహీనతలతో సహా స్వీకరించడం నేర్చుకోండి. కారణం ఇతరులనుండి కూడా మీరు ఇలాంటి గుణాన్నే కోరుతారు.

మీ ఎదుటివాడి కంటికి మీరు నచ్చినట్లు కనపడ్డారనుకోండి. అప్పుడు వారు మీపట్ల సదభిప్రాయాన్ని పెంచుకుంటారు. ఇలా చేయడంలో మీ మిత్రుల సంఖ్య పెరుగుతుంది. ఆ కారణంగా మీ కంటిలో ఆనంద తాండవ నృత్యం స్పష్టంగా ఎదుటి వాడికి కనబడుతుంటుంది. దాంతో మీ దైనందిన జీవితం సుఖశాంతులతో సాఫీగా సాగగలదు.

పై సూత్రాలను మీరు పాటించగలిగితే స్వర్గం మీ అరచేతిలోకి రాగలదు. జీవితం పట్ల మీలో ప్రేమానురాగాలు పెరుగుతాయి.

"**సంగీతం** - ధన సంపాదనకు, ప్రజల్ని వినోద పర్చేందుకు కాదు, **అది** భగవంతుని చేరుకునేందుకే." —ఉస్తాద్ అలీ అక్బర్‌ఖాన్

పి.డి. త్యాగి

మనదేశంలోని పలు ప్రాంతాలలో పలు పేర్లతో ఈ కరంజ్ వృక్షం పిలువబడు తూంది. తెలుగులో గానుగ - పుంగరగానూ, తమిళంలో పొంగ - పొంగమ్‌గానూ, కన్నడ భాషలో హొంగగానూ, పుంగు - పున్నుగా మలయాళం భాషలోనూ, కోరంజోగా




ఒరియా భాషలోనూ ఈ చెట్టు పిలువ బడుతుంది. ఈ చెట్టు చాలా త్వరగా ఏపుగా పెరిగే చెట్టు. ఈ చెట్టు 25 మీటర్ల ఎత్తుకు ఎదుగగలదు. ఈ చెట్టు బోదె వ్యాసం 60 సెంటీమీటర్ల దాకా ఉంటుంది.

భారతీయ ఉపఖండపు వృక్షం ఈ కరంజ్ చెట్టు. ప్రస్తుతం ప్రపంచంలో అన్ని తేమ గలిగిన ఉష్ణ ప్రాంతపు దిగువ ప్రాంతాలలో ఇది బాగా వ్యాపించిపోయింది.

అన్ని రకాల భూముల్లో ఈ చెట్టు పెరుగ గలదు. భూమిలోని ఉప్పును ఇవి ఎక్కువగా సహించగలవు. అంతేకాదు ఈ చెట్టు వ్రేళ్ళు ఉప్పు నీటిని కూడా భరించి నిరాఘాటంగా పెరుగగలదు.

భారతీయ ద్వీపకల్పంలోని మెట్ట ప్రాంతాలలో అడవుల పెంపకం కోసం ఈ చెట్టు విత్తనాలను విరివిగా నాటుతుంటారు. ఈ చెట్టు నేలకోతకు రాంబాణం లాంటిది. ఈ చెట్టు సహాయంతో ఇసుక దిబ్బల మార్పిడిని బాగా అరికట్టవచ్చును. రోడ్డు ఇరువైపుల బారులుగా చెట్లు నాటేందుకు కూడా ఈ చెట్టు విత్తనాలను దేశం మొత్తంలో వాడుతున్నారు.

ఇంధనం కరువు కారణంగా కరంజ్ విత్తుల నూనెను డీజల్ ఇంజన్ ఇంధనంగా

## కేరళ - అత్యధిక చదువరులు

*59 శాతంతో - కేరళలో వార్తాపత్రికలు, మాగజైన్‌ల చదువరుల సంఖ్య అధికంగా ఉంటుంది. దక్షిణాది రాష్ట్రాలలో వయోజను లలో 30 శాతం, వార్తాపత్రికలు, మాగజైనులు చదువుతారు. పోల్చినప్పుడు హిందీ మాట్లాడే రాష్ట్రాలలో ఇది 16 శాతంగా ఉంటుంది.*

*— నర్వేటై ఆపరేషన్ రిసెర్చి గ్రూప్ ఆధారంగా*

"అభిప్రాయాలను ప్రశ్నించే వ్యక్తి తెలివికలవాడు; వాస్తవాలతో పోట్లాడే వ్యక్తి - మూర్ఖుడు." — ఫ్రాంక్ ఎ. గార్బట్

వాడడానికి ప్రస్తుతం ప్రయత్నం సాగుతూంది. ఈ కరంజ్ మనకు రెండు రకాల ఘనాకారపు ఇంధనాల్ని, రెండు రకాల ద్రవ్యరూప ఇంధనాల్ని సరఫరా చేయగలదు. ఘనాకారపు ఇంధనాలుగా మనం వంట చెఱకును బొగ్గును వాడుతున్నాం. అదే విధంగా మెథనాల్, బీజ తైలాన్ని, ద్రవ్య ఇంధనాలుగా ఈ చెట్టు మనకు ఇస్తుంది.

వంట చెఱకుగా మాత్రం కాకుండా ఈ చెట్టు కలపను బీరువాల నిర్మాణానికి కూడా ఉపయోగిస్తున్నాం. ఈ కలపతో బండి చక్రాలు, నాగళ్ళు ఇతర తిరుగు సాధనాలను సులభంగా తయారు చేసుకోవచ్చు. ఈ చెట్టు బెరడు, దారాలు-త్రాళ్ళ తయారీకి ఉపయోగపడుతుంది. ఈ కరంజ్ ఆకులు నీళ్ళు లేని ప్రాంతాలలో బహు ముఖ్యమైన పశుగ్రాసంగా వాడబడుతున్నాయి.

ఈ ఆకులను ఎరువుగా, విస్తృతంగా వాడుతున్నారు. ఈ ఆకులు మందుల తయారీకి ఉపయోగపడుతున్నాయి. పుస్తకాలను భద్ర పరచుకోవడానికి, ధాన్యాలను నిలువ ఉంచుకోవడానికి కూడా ఈ ఆకులు విరివిగా వాడబడుతున్నాయి. ఈ చెట్టు వ్రేళ్ళను కంటి వ్యాధులను, చర్మ వ్యాధులను, స్త్రీ జననేంద్రియ వ్యాధులను నివారించేందుకు వాడుకుంటున్నాం.

కరంజ్ విత్తులలో పసుపు లేదా ఎరువుతో కూడిన గోధుమరంగు గల తినదగని కొవ్వుతో కూడిన నూనె ఉంటుంది. పరిశ్రమలలో ముఖ్యంగా తోలును అందంగా తీర్చి దిద్దేందుకు, సబ్బు బిళ్ళల, కొవ్వొత్తుల తయారీకి ఈ నూనె వాడబడుతూంది. అంతేగాకుండా, ఈ నూనెను కందెనగా, ఆల్కయిడ్ తయారీకి ఉపయోగపడే వస్తువుగా మనుషుల, పశువుల చర్మ వ్యాధులకు ఔషధంగా వాడడం జరుగుతోంది. నూనె తీయబడిన తరువాత వచ్చే పిప్పిని పశువుల మేతగా వాడుతున్నారు. ఇందులో నత్రజని శాతం ఎక్కువగా ఉండటం వల్ల పంటకు ఎరువుగా కూడా ఇది విరివిగా వాడబడుతున్నది.

— 'ఇన్వెన్షన్ ఇంటలిజెన్స్' సౌజన్యంతో

## హాస్య కచేరి!



* మితిమీరి తినేవారికి జరిమానా అధిక శారీరక బరువు

* ఎక్కువ రోజులు జీవించి ఇంకా తినడానికి తక్కువ తినండి.

* పథ్యం ఈ రోజులలో చాలా సులువైపోయింది. కారణం మనం కొనగలిగిన వస్తువులనే తింటున్నాం.

"ఒక పావురం కాకులతో సహవాసం మొదలుపెడితే దాని ఈకలు తెల్లగానే ఉన్నా, దాని హృదయం నల్లగా మారుతుంది."

# ఆత్మరక్షణాధికారం

ప్రతీ ఆడ, మగవారిలో కొస్తంత ఆత్మ విశ్వాసం, తన్నుతాను కాపాడుకోవడానికి, తన సొత్తును పరిరక్షించుకోవడానికి, తన కుటుంబాన్ని ముఖ్యంగా ఆడువారిని కాపాడుకోవడానికి కావల్సినంత ధైర్య సాహసాలుండాలి. ఇంతే కాకుండా వ్యక్తి మరియు ఇతరుల ఆస్తులను కాపాడేటంత ధైర్యం కూడా ఉండాలి. ఆత్మరక్షణ సూత్రానికి ప్రాతిపదిక ఇదే.



ఆత్మరక్షణాధికారాన్ని అపరాధం చేస్తున్న పరిస్థితులలో ససేమిరా వాడరాదు. ఈ అధికారాన్ని ఆత్మరక్షణ కోసమే వాడుకోవాలి. దొంగ మీ ఇంటిని దోచుకునో లేదా దోచుకో కుండానే మీ ఇల్లు వదలి పారిపోతున్నాడను అప్పుడు వాడిని పట్టుకుని ప్రాణాంతకంగా గాయపరచరాదు. కారణం ఇది ఆత్మరక్షణ పరిధిలోకి రాదు. ఇక్కడ మీరు మీ ఆత్మరక్షణ చేసుకోవడం లేదు.

ఎదుటివారిని మీరు దాడికి ప్రేరే పించారనుకోండి. అప్పుడు మీరు ఆత్మరక్షణ అధికారాన్ని అడ్డం పెట్టుకోలేరు. కొట్లాటను లేదా రగడను ప్రారంభించి అవతలివాడు

## 75 నిమిషాల్లో 75 బంతులకు అందరూ ఔట్

*ఇంగ్లండు - దక్షిణ ఆఫ్రికా దేశాల మధ్య మొదటి టెస్ట్ క్రికెట్ మ్యాచ్ 1924 లో జరిగింది. గిల్లిగాన్, టాటే (Tate) లు మొదటి 75 బంతులను బౌలు చేశారు. 75 నిమిషాల్లో 30 పరుగులిచ్చి దక్షిణ ఆఫ్రికా జట్టును ఓడించారు. ఈ 30 పరుగుల్లో 11 అదనపు (Extra) పరుగులున్నాయి.*

## రొట్టెలనే ఎక్కువగా తిన్న ప్రాచీన ఈజిప్టు దేశవాసులు

*జర్మన్ పరిశోధకుడు శ్రీ ఇ. ఎండెస్‌ఫెల్డర్ (E.Endesfelder) ప్రాచీన ఈజిప్టు దేశవాసులు ఎక్కువగా రొట్టెలనే తినేవారని తమ పరిశోధనల ద్వారా చెబుతున్నారు.*

*—'మిషా' సౌజన్యంతో*

"18లో మన విశ్వాసాలు మనం ఎక్కిచూసే కొండలు. 45 లో అవి మనం దాక్కునే గుహలు.

తిరుగుబాటు చేస్తున్నప్పుడో లేదా మిమ్మల్ని ఇతరులు గట్టిగా పట్టుకున్నప్పుడో మీరు కత్తి ఝళిపించడం తప్పు. ఇది 'ఆత్మరక్షణ' అనిపించుకోదు.

పోలీసులు లేదా ఇతర ప్రజాధికారుల సహాయం కోరేంత సమయం ఉన్నప్పుడు మీరు మీ ఆత్మ రక్షణాధికారాన్ని వాడుకో కూడదు.

ప్రజాసేవకులు తమ విద్యుక్తధర్మాల్ని నిర్వహిస్తున్నప్పుడు లేదా శాంతి భద్రతలను కాపాడుతున్నప్పుడు మీరు ఆత్మరక్షణాధికారాన్ని ఉపయోగించుకోకూడదు. ఒక పోలీసు అధికారి వారెంటుతో వచ్చి మిమ్మల్ని బలవంతంగా ఖైదు చేసినా ఆత్మరక్షణ ప్రశ్న ఉదయించదు. మీరు అతనిపై దాడి చేసి "నేను ఆత్మరక్షణకై ఈ పని చేశాను" అని చెప్పి తప్పించుకోలేరు. కోర్టు అమీనా, ఆదాయం పన్ను అధికారులు, మునిసిపల్ అధికారులు ఇత్యాదులను మనం ప్రజా సేవకులుగా గుర్తించాలి.

ఆత్మరక్షణ కోసం మోతాదుకు మించి ఇతరులను గాయపరచరాదు. అలా గాయ పరచటం ఆత్మరక్షణ అనిపించుకోదు. ప్రత్యర్థి మీపై చేస్తున్న దాడి తీవ్రతపై మీరు ఆత్మరక్షణకై తీసుకున్న చర్య ఆధారపడి ఉంటుంది.

— చేతన్ వ్యాస్

— 'పార్థ' సౌజన్యంతో

## సుమతి

తాత్పర్య రచన: యామిజాల పద్మ నాభస్వామి

*కనకపు సింహాసనమున*
*శునకముఁ గూర్చుండబెట్టి శుభలగ్నమునం*
*దొనరగ పట్టము గట్టిన*
*వెనుకటి గుణమేలమాను? వినరా! సుమతీ!*

*[మంచి ముహూర్తం చూసి కుక్కకి చక్కగా ముస్తాబు చేసి బంగారు సింహాసనం మీద పొందికగా కూర్చుండబెట్టి పట్టాభిషేకం చేస్తే అది సభలో చెప్పులెక్కడ ఉన్నాయా అని చూస్తుంది గాని గద్దెపై ఉన్న గౌరవం నిలబెట్టుతుందా? ఏలాటి యోగ్యత లేనివానికి అధికారం అప్పగిస్తే సవ్యంగా అందరికీ ఆదరంగా నడుస్తాడా?]*

*కూరిమిగల దినములలో*
*నేరములెన్నడును కలుగనేరవు; మరియా*
*కూరిమి విరసంబైనను*
*నేరములే తోచుచుండు నిక్కము సుమతీ!*

*[ఒకరితో ఒకరు మంచిగా మాట్లాడు కుంటూ స్నేహం పెంచుకున్నంతకాలం ఒకరి తప్పులు ఒకరికి తెలియవు. ఆస్నేహం కాస్త సన్నగిల్లితే లేనిపోని*

*స్నేహం చెడకుండా మంచిగా పెంచు కుంటూ ఉండాలి.]*

**"దేవుడు నిన్ను చూసినట్లుగా భావించి మనుషులతో కలిసి జీవించు; మనుషులు విన్నట్లుగా భావించి దేవునితో సంభాషించు."  — సెనికా**